ఓమ్.

శ్రీమత్పురాంబికాయై నమః.

శ్రీ

# రసాశ్రయము.





ఇది

కవికిశోర, ఆశుకవికేసరి, అవధానధురంధరేత్యాది

బిరుదాంకితుండును శతావధానియు నగు

**శ్రీపతి త్ర్యంబకరావుచే**

రచింపఁబడియె.

1ST EDITION 1,000.

బెజవాడ: ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు,

క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడియె.

1933

 [వెల రు 0—10—0.

ఓమ్.

శ్రీమత్పురాంబికాయైనమః.

# ప్రశంస.



కం॥ శ్రీయుత శనివారంపుఁ జే
టాయతరాజ్యైకపాల ♦ నాంచిత విజయా
ప్పరాయావనినాథుని దీ
ర్ఘాయురుపేతునిగఁ జేయు ♦ మా జగదంబా!

సీ॥ ఏ రాజు మత్తేభ ♦ బృంహితధ్వానమ్ము
లను వించు నిమరమే ♦ ల్కాంచుచుండు
నే క్షోణిపుఁడు యశో ♦ బ్జాక్షి కలంకార
ములఁ గూర్చుటనఁ బ్రొద్దుఁ ♦ బుచ్చుచుండు
నే నృపాలుని నగా ♦ రానాద మహరహం
బాదరమ్మున యాచ ♦ కాళిఁ బిల్చు
నే విభుం డఖిలవి ♦ ద్యావినోదాయత్త
భావుఁడై పండితా ♦ వళుల నేలు

తే॥ గీ॥ నతఁడు రాణించు నప్పరా ♦ డన్వవాయ
జలధిరాకాశశాంకుఁ ♦ డుజ్వలచరిత్రుఁ
డా సవాయి యశ్వారా ♦ డ్బహద్దరు బిరు
దాంచితుఁడు విజయాప్పరా ♦ యావనిపుఁడు.

ఉ॥ శ్రీ విజయాప్పరాయనృప ♦ శేఖరుదానమహత్త్వతత్త్వగా
థావలు లాలకించి ప్రియ ♦ మందుచు, శస్తసమసరాజమో
దావహసత్కృతుల్ వడసి ♦ తారయతే చెప్ప డీ నృపాలు నేఁ
డావెలితిక్క దొంగఁగఁ బ్రియత్న మొనర్చెద నంచు నే నెదన్.

మ॥ చని శ్రీమద్విజయాప్పురాట్ప్రభుఁ గవీశానస్తుతివ్రాతసం
జనితాఖండయశోవిలాసు సముదంచత్ప్రాభవోపేతు ని
త్యనయస్వాంతహితౌఘసేవితు నిజాస్థానస్థితుం వేడ్కమైఁ
గని యాశీస్సు లొసంగి మత్కృతఫల వక్కాణించి యిట్లాడితిన్. ౪

మ॥ లలితానూనయశస్సతీకరకరాలంకారుఁ డౌదార్యసం
కలితస్వాంతుఁడు కందిమళ్లకులవేంకటాద్రిరాయప్రభుం
డెలమి న్నాదు శతావధానకవితావృత్తిన్ విలోకించి యు
జ్జ్వలసత్కారము సల్పె మున్నుఁ దమ యాశ్వారావుపేటన్ నృపా!

తే॥ గీ॥ ఎఱుఁగుమయ్య వేంకటాద్రిమనృపతివలన
నస్మదీయకవిత్వమాహాత్మ్యమెల్ల
నాత్మభూషణసాప మం చాడుచుండ్రు
విజ్ఞు లటుగాన నేఁ జెప్ప వెఱతు భూప! ౫

ఉ॥ కమ్మనితేనెవాఁక లుబుకన్ గృతియొండు లిఖించినాఁడ నా
త్నమ్ముగ దానియచ్చునకుఁ దగ్గధనమ్ము గడింప దేశదే
శమ్ములు గ్రిమ్మరిల్లి, నృపచంద్రమ! వేసరు వేళ, నీ చరి
త్రమ్మును వింటి, నాశ్రమ ఫలప్రద మయ్యె నటంచు నెంచితిన్. ౬

మ॥ దురహంకారులు మేకవన్నెపులుల్ దుష్టుల్, మహాలోభు, లు
ద్ధురదాకాంక్షులు, విశ్వదాతలు, కళాదీప్తోరుకృత్యంగనా
సరసాలాపము లాలకించెదరె? హర్షం బూనునే షండుఁ డే
త్తఱి శృంగారవిలాసయౌవనవధూటిన్ గాంచి? భూపాలకా! ౭

ఉ॥ కానఁ గృతిన్ గ్రహించియొ? యఖండవధానవిధానధారణా
నూనకళావినోదము గనుంగొనియో! మదభీష్ట మీయఁగా
మానసమందు నెంచుట, సమంజస మో విజయేశ్వరా! యనం
గా,నగుమోముతో నృపతి గాంచెద మే మవధాన మంచనెన్. ౮

చ॥ సరసులు బాంధవుల్ హితులు • సత్కవులున్ దనుఁగొల్చియుండ, నా
దరమునఁ గాంచి నా శతవ•ధానవిధానచమత్కృతిన్ బ్రిను
ద్భరితుఁ డతం డొసంగె, విహి•తమ్ముగ నూటపదార్లు ముద్రికా
భరము దొఱంగినాఁడ జన•పాలునికూరిమిచేత, నేఁటికిన్. ౧౦

ఉ॥ ఆ యసమానమానసనృ•పాగ్రణి కౌశిషముల్ పొనర్పు మం
బా! యఖిలార్థసందలు • భాసురరాజ్యరమాసతీవిలా
సాయతభోగసౌఖ్యములు • నంచితకేశవపాదభక్తి! దీ
ర్ఘాయువు, సత్కుమారనిచ•యప్రముదమ్ము లొసంగు చెప్పుడున్. ౧౧

ఇట్లు విధేయుఁడు,

బెజవాడ, గవర్నరుపేట. } శ్రీపతి త్ర్యంబకరావు,
శతావధాని,

---

# తప్పొప్పుల పట్టిక.



| పేజి నెంబరు. | పంక్తి నెంబరు. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 10 | వుకలు | కవులు |
| 4 | 19 | ఎడకు | ఏడకు |
| 10 | 2 | దోపకున్న | దోఁపకున్న |
| 70 | 7 | గశ్లేష | గంశ్లేష |
| 77 | 21 | దోచు | దోఁచు |
| 82 | 3 | చికుల | చీకుల |

ఓమ్.

శ్రీమత్త్రిపురాంబికాయై నమః.





శ్రీ

# రసాశ్రయము.

## ౧వ దళము.

తే॥ గీ॥ అనఁగ ననఁగఁ బురం బొకం డతిశయిల్లు
నాలుజాతులతోడ సంతతసమృద్ధ
ధనకనకవసువాహనతతులతోడ
నలక యన భూవరారోహఁ దిలక మగుచు. ౧

ఉ॥ కాలము మారిపోయినది కావునఁ దన్నగరీమతల్లి వి
ద్యాలవమర్విదగ్ధజనతాకృత నూత్నగృహప్రఘాణపం
క్తాలి వసించి యందలి సుందరాంచితవాసనఁ బిచ్చలించి యాం
దోళనఁ జెంది వేగము చనున్ శివునాలయపార్శ్వభూమికిన్. ౨

సీ॥ తేనెవాఁకలచాయ లూను కైత నదొక్క
కృతయా యనెడు కావ్యకర్తలు గలరు
తేనెపూసినకత్తి తీర్పరి జనులకొం
పలఁదీయు న్యాయవాదులును గలరు
పేరు పత్రిక కెక్కు వెన్కఁ స్వీయోద్యమ
మ్ములఁ దోయు దేశభక్తులును గలరు

మాధుకరం బన్న◆మాట విన్నంత వా
కిలి మూయఁ జేయువదా◆న్యులును గలరు

తే॥ గీ॥ దివ్యభవనాళి నద్వైత◆దీలనుంచి
తాతనిర్మితధర్మస◆త్రమ్ము భుక్త
పరచుకొను యోగ్యులు గలారు ◆ వైభవాము
రాలకోపమమైన య◆య్యాలకయందు. ౩

ఉ॥ స్నానము సంధ్యయుఁ జలిపి ◆ శిక్కోలందగఁ బేదవారి కే
మే నిడు పారమార్థికుల ◆ హీనకులక్రమధర్మతత్పరా
నూనమనస్కు లప్పురిని ◆ యుండుదు రెవ్వరిఁ జేరఁబోవ కే
దే నతిదీనతావ్యథ గ్ర◆హింపక పుణ్యపథానుసారులై. ౪

తే॥ గీ॥ ఆపురిఁ గలండు పాణవి◆ద్యానిధానుఁ
డమలశాంతస్వరూపుఁ డ◆త్యధికభక్తి
వినయతాత్పర్యభావుఁ డు◆ద్వేగచిత్తుఁ
డారువేలనియోగి, నం◆దాఖ్యుఁ డొకఁడు. ౫

ఉ॥ యోగమె బుద్ధి నిచ్చునో ప్ర◆యోజకతామహిమమ్మొ యేమొ, కా
నీ గడియించె విత్తమకఁ ◆ డియ్యది పాపము నాక లంచముల్
కాఁగల లక్షలన్ జెనుపఁ◆గా నధికారులు మెచ్చఁగా సము
ద్యోగమహత్త్వ మొప్పగ శి◆రోజములన్ దలఁపుల్ ఫలింపఁగాన్. ౬

తే॥ తాతసముపార్జితమ్ము క్షే◆త్రమ్మొసంగు
లక్ష, స్వీయార్జనమ్మెను◆లక్ష లుండు
నతని, కేమున్నఁ బైసయు ◆ నరి కీయఁ;
డకట యున్నలోభికె దేవుఁ ◆ డైన నొసఁగు. ౭

తే॥ నెమ్మిఁ బైవార లుపవేత◆న మ్మొసంగ
నింట ఋణదాతయై వసి◆యింపుచుండెఁ
బుడమి ధన మున్న, నేకుఁడు ◆ గుడుచుచున్న
మాసిపోవు నీ కలికాల◆మహిమ కతన. ౮

ఉ॥ కమ్మిన మోసకార్యములఁ ♦ గాని, యనాథలనైనఁగాని, నె
య్యమ్ములఁ దోడఁబుట్టువుల ♦ నమ్మిలిఁ దోఁచినవైనఁగాని ని
క్కమ్మగు వారసత్వమునఁ♦గాని లభించిన లిబ్బిఁ జీకువాల్
కొమ్మగఁ దొంటి మస్తిఁ దఁలంపనివారి నెఱుంగమే ధరన్. ౯

తే॥ గీ॥ జరిగి విఱిగిన వావృద్ధ♦సరసమూర్తి
కైన పెండ్లిండ్లు దాఁటిన ♦ వఱువనైన
వత్సరమ్ములు తిరిగి వి♦వాహకాంక్ష
యత్నము లొనర్పఁదొడఁగె బ్రా♦హ్మణుల నంపి. ౧౦

క॥ 'కాయశరీరయుఁ' బొట్టియు
నై యుండుటచే నతండు ♦ నడిగిన నేరెన్
బ్రాయము నలుబది దాఁటిన
వీయాపాధమున కని వ♦చించుఁ బ్రియమునన్. ౧౧

వ॥ ఇట్లు వచించి యొరుల వంచించి యత్నించి, యత్నించి తుదకు,

సీ॥ కప్పుచొప్పుదురంగుఁ ♦ గలపడ మొనరించి
సవరించినట్టి మీ♦సములతోడఁ
బలికినంత హొరంగు ♦ బంగారు సింగార
ముం గారు దంతవి♦స్ఫూర్తితోడ
జిలిబిలిపనితన ♦ మొల్కలయించు నపరంజి
తళుకునుచెంతబె♦త్తమ్ముతోడ
జలతారు కుచ్చుల ♦ జగు లెచ్చఁగ నొక్క
ప్రక్క వ్రాలినతల♦పాగతోడ
తే॥ గీ॥ సిద్ధమకరధ్వజౌషధ♦సేవనమున
మలసిన మెఱుంగు పెండ్లికు♦మారుఁ జేయఁ
గుసుమకోమలి నొకకన్నెఁ ♦ గోరి యాతఁ
డాడెఁ బెండిలి తన కుటిం♦తాత్రడుగాగ. ౧౨

తే॥ గీ॥ తా నొకం డౌట, నా-యనఁ♦దగవారు
లేమి, ధన మిచ్చి కొనెఁ గాన ♦ లేమ నపుడె

కాపురముఁ జేయఁ దొరయఁగాఁ ♦ గలిగె నాతఁ
డామె పై కేడ్వ్యకయ మన♦ మందుఁ గుముల. ౧౩

ఉ॥ ఆఱవపెండ్లిభార్య కల ♦ దాతనికిన్ రతనాలబొమ్మ, శృం
గారరసాధిదేవి, నవ♦కమ్ము తెలుంగు మెఱుంగులాడి, గం
భీరగుణాలవాల, సుక♦విత్వరసజ్ఞ, కలాభిరామ, వి
స్ఫారముహుర్ముహుశ్చలిత♦భావ, లసత్కమలాభిధానయై. ౧౪

తే॥ పోతుటేఁగయేనిఁ ♦ బోరానిసౌధమ్ము
ద్వారమందు నెపుడు♦ వాలుకుర్చి
లోన నాతఁడుండు ♦ రొప్పుచు, దగ్గుచు
గొణుఁగుకొనుచు సేవ♦కులఁ గసరుచు. ౧౫

ఉ॥ క్రొమ్మెఱుఁగుల్ జొకారముల♦కున్ బయిపెచ్చగుమేనిసొమ్ము, లం
దమ్ము మఱింత చేయఁగ, క్షణమ్మున కొక్కకరీతిగా దుకూ
లమ్ముల మార్చుచున్ గరగ♦రన్ మెయి సాకుచు, ముంగురుల్ నిజా
స్యమ్మునఁ దాండవింపఁగఁ బ♦చారు లొనర్చెడు లో నెలంతయున్. ౧౬

ఉ॥ క్రొత్తగళమ్ము విన్న నడు♦గుల్ మెలమెల్లనఁ బెట్టుకొంచుఁ దా
న త్తలుపోరఁగా నిలిచి ♦ యట్టెఁడు కంటికిఁ గానవచ్చు న
ల్లెత్తిన చెప్పు దింపక. ని♦రీక్షణచేయు, ధవుండు కొంచలేఁ
డత్తలిరాకుఁబోఁడి వెను ♦ కాటఁ దదీయవిలాసచేష్టలన్. ౧౭

ఉ॥ ఏడకు నేగరాదఁట, మ♦ ఱెవ్వరితోడను మాటలాడఁగాఁ
గూడ దటంట, తా నెఱుఁగ♦కుండ వధూటి యటుల్ పొనర్చినా
యాడఁగరాని తిట్లు, మఱి♦యాదకుఁ దప్పు చివాట్లు, నెన్నఁడేన్
జూడనికొట్లు, వృద్ధసర♦సుండు బహూకృతిగా నొసంగెడున్. ౧౮

వ॥ ఆలేమయు.

సీ॥ గడియపాఱి ద్దెక్కపైఁ ♦ బడకటిల్లును వీడు
నటు వీడి కాలకృ♦త్యముల సలుపు
సలిపి మోమునఁ జొక్కఁ ♦ గళ యుట్టిపడ దిద్దు
దిద్ది దువ్వల్వను ♦ దీర్చికట్టుఁ

గట్టి పై మేడలోఁ ♦ గల పుస్తకావళిఁ
దనకిష్టమైనపొ ♦ త్తమ్ముఁ దీయుఁ
దీసి లోలోపలఁ ♦ దిన్నఁగాఁ బఠియించుఁ
బఠియించి కనుమూసి ♦ పడకఁ జేరుఁ
తే॥ గీ॥ జేరి కుందును, కుంది ప ♦ చారుచేయుఁ
జేసి మోమునఁ జేఁ జేర్చి ♦ చింత నొందు
నొంది కడ నొక్క వేడిని ♦ ట్టూర్పు పుచ్చుఁ
బుచ్చి తనవేదనన్ గప్పి ♦ పుచ్చు నెలఁత. ౧౯

క॥ తారాశశాంకవిజయము
స్వారోచిషమనుచరిత్ర ♦ స్మరశాస్త్ర కళా
ధార రసవత్కథావళు
లారమణీమణి పఠించు ♦ ననిశముఁ బ్రీతిన్. ౨౦

సీ॥ చన విచ్చి కలకోర్కె ♦ ల నెఱింగి సమకూర్చు.
రసమయు సాహచ ♦ ర్యమ్ముఁ గోరు
బిగియారుకౌఁగిళ్ళఁ ♦ బెనఁగుచో నొదవెడు
నానంద మూహించి ♦ యటమటించుఁ
బొలయల్కఁ గుల్కుచుం ♦ బుక మంటి బతిమాలు
ప్రియుని వైఖరు లెంచి ♦ వెతఁ దపించుఁ
గమ్మవిల్కానికూ ♦ టమ్ములో నుదయించు
గళరవమ్ముఁ దలంచి ♦ కలఁతనొందు
తే॥ గీ॥ నధరమధురసుధాస్వాద ♦ నాంచితోరు
మదనసామ్రాజ్యసౌఖ్యసం ♦ పద్వితాన
మాత్మ హత్తించి మఱచుఁ గృ ♦ త్యముల నెల్ల
బంజరనిబద్ధకీరమ్ము ♦ భాతి నాతి. ౨౧

చ॥ చిఱుచెమటల్ గళారవవి ♦ శేషము లున్నతపారవశ్యవి
స్ఫురణములున్ గళాచలన ♦ మోదములున్ బిగికౌఁగిలింత లే
డెఱ మధురాధరామృతపుఁ ♦ దీపియుఁ జుంబనరీతు లెప్పు డే
నెఱుఁగ దటా లతాంగి యొక ♦ యేఁడు పయింబడెఁ గూట మై, కటా.

సీ॥ ఓసరిల్లుటె కాని, ♦ యాసమై పతిచెంత
కరుగమిగా పలు ♦ పందియున్నఁ
గంటగించుటె కాని, ♦ జుంటితేనియ లూరఁ
బలుకమిగా మగం ♦ డెలమిఁ గనిన
విసువు చూపుటె కాని, ♦ కొసరఁ బోవమిగా ని
జాభీష్టముల్ ధవుం ♦ డడుగుచున్నఁ
బోరగిల్లుటె కాని, ♦ మోముదమ్మి నొకింత
యెత్తమిగా నాథుఁ ♦ డొత్తుచున్న,
తే॥ గీ॥ బెదరుటే కాని; చోటు నీ♦యమి గదా య
తఁడు సమర్థునివలెఁ బ్రియ♦త్నము లొనర్చి
వ్యథఁ దపించుచునున్న నొ♦కప్పుడేని
వృద్ధవాసన భరియింప♦లేక లేమ. ౨౩

వ॥ మఱియు నొకానొకప్పుడు.

ఉ॥ హుమ్మను జృంభణమ్మునకు ♦ నూల్కొనఁ జాలని నాథుఁ గాంచి చే
తమ్మున నుస్సురంచుఁ జెయి♦దమ్ముల వీడి కనుల్ మొగుడ్చి పు
ట్టమ్మను దిద్ది తా నలస♦టన్ బడినట్లు నటించి 'చాలు లెం
డిమ్మగ నవ్విపోదు రెవ♦రే నెపు డీపనియేన' యంచనున్. ౨౪

క॥ ఇటు లొకటన్నర వత్సర
మెటులో వేఁగింప వార ♦ లిరువురు నాపై
స్ఫుటలోకనాటకాంచిత
నటకుండు వసంతుఁ డెమరు ♦ నడిచెఁ దనంతన్. ౨౫

క॥ మాసము మధుమాసము, సుమ
హాసము సహకారమల్లి♦కాములకు, మహా
యాసము విరహిణులకు, నా
వాసము కలకంఠగాన♦వైభవములకున్. ౨౬

క॥ దరమై పల్లవకరసుం
దరమై రతికాంతతురగ♦నవనినదమహా

దరమై జపారుణసుధా
ధరమై భూకాంతచెలువు ♦ తాండవమాడెన్. ౨౭

సీ॥ నవయౌవనప్రాప్త♦నారీవతంసంబు
కులుకు చన్గుబ్బలు ♦ పులకరించె
రాజభోగాభోగ♦రాజత్సుఖానంద
లలనామణికి గుండె ♦ జలదరించె
విప్రయోగాఖిన్న♦భిన్నభావప్రౌఢ
కామిని రేఁబవల్ ♦ కలవరించె
సరససల్లాపాతి♦శయమోదసంపన్న
జరఠభామిని మదిన్ ♦ బిరుసునించెఁ

తే॥ గీ॥ గరుడు గట్టిన మదనరా♦గమ్ములెల్ల
లలితసహకారనూత్నప♦ల్లవవితాన
ఖాదనోన్మత్తపికపికీ♦గణమనోజ్ఞ
గానమాధురిమన్ జిక్కి ♦ కరఁగువేళ. ౨౮

చ॥ ఒడికములై దళమ్ములొక♦టొక్కటి విచ్చ, ద్రవప్రవాహినుల్
వెడలఁ, గుమారమారుతుఁడు ♦ ప్రీతిని బెంప, వసంతరాగముల్
బెడఁగుఁదనమ్ముఁ గూర్ప, మద♦భృంగభుజంగుఁ డనూననాదముల్
పాడమరింపఁ జొచ్చె విరి♦బోఁటుల నామని ముమ్మరేఁగఁగాన్. ౨౯

సీ॥ శుకశారికాపిక♦స్తోమమనోజ్ఞని
స్వనము మంగళవాద్య♦సమితి కాఁగ
లలితారుణప్రభో♦ల్లసితపల్లవసము
త్కరము మేల్ముసుఁగు క్రొం ♦ దళుకు కాఁగ
సురభిళావృతదిగం♦తరఫుల్లమల్లికా
చయము చిన్నగవుల♦జల్లు కాఁగ
మధుపానమదవిభ్ర♦మణమధువ్రతనికా
యము స్వీయపరిచారి ♦ కాళి కాఁగ

తే॥ గీ॥ తరుణమలయానిలుండు బాం♦ధవుఁడు కాఁగ
ప్రథమసంధ్యాసమయము మూ♦ర్తంబు కాఁగ

నాడుకొనిరి వసంతంబు ♦ లాటఁ బ్రణయ
భరితవనరమామాధవు ♦ లరుస మెసఁగ. 3౦

మ॥ కలికిన్ బ్రేమమయాంతరంగను వియో ♦ గక్లేశసంఛన్న ని
స్తులశృంగార రసాభిరామఁ ద్విజగ ♦ చ్ఛోభాయమానాంగిఁ జం
చలదృగ్రాగసమంచితన్ వనరమన్ ♦ సత్కారసల్లాప స
ల్లలితాలింగనలన్ గరంచెఁ దొలిలీ ♦ లన్ మాధవుం డేడ్తెఱన్. 3౧

మ॥ కొసరెన్ గూటమిలో మదిన్ గలుగు కో ♦ ర్కుల్ తీరమిన్ హావభా
వసలజ్జాధరవీక్షణాకటిచల ♦ ద్వ్యాపారశైయాత్యకృ
త్యసముల్లాసకుచోపగూహనమహో ♦ ద్యజ్జృంభణాసూచిత
వ్యసనోన్మత్తమనస్క యొక్కతె వసం ♦ తారంభకాలంబునన్. 3౨

తే॥గీ॥ సహజమాధుర్యపంచమ ♦ స్వరమనోజ్ఞ
గానవీచీనిమగ్నపి ♦ కమ్ముఁ గాంచి
సరసచాతుర్యధుర్యర ♦ సప్లుతాత్మ
కవికుమారులు లేఖినుల్ ♦ కదిపినారు. 33

తే॥గీ॥ కామశాస్త్రరహస్యసం ♦ గతుల నెల్ల
శ్రమయనక శ్రద్ధగఁ బఠించి ♦ బ్రహ్మచారి
తరుణమునకుఁ దపించి యు ♦ స్సు రనుచుండెఁ
జిరవిధురకార్శ్యభావల ♦ చెంతఁజేరి. 3౪

తే॥గీ॥ ప్రణయినీమోహపాశని ♦ బద్ధు లగుచు
జీవితవ్రతోద్యాపనన్ ♦ జేయ నేల
కడను రౌరవాగ్నులఁ గూలఁ ♦ బడఁగ నేల
జీవులారా! యటంచు ఘో ♦ షించెఁ బికము. 3౫

తే॥గీ॥ అంబికానవరాత్రమ్ము ♦ లాచరింప
రామచంద్రునిదివ్యక ♦ ల్యాణసమయ
గానముల మోదములఁ బెంపఁ ♦ గాఁ దొడఁగిరి
నరులు నిశ్చలభక్తిమ ♦ నస్కు లగుచు. 3౬

తే॥గీ॥ చివురుటాకుపుట్టమ్ములఁ ♦ జెలఁగి ప్రసవ
విరచితాలంకృతాంగయై ♦ సరసగాన
ఫణితులన్ జిక్కి చొక్కెడు ♦ ప్రకృతికళల
లలి జగన్నాటకావని♦కలు రహించె. ౩౮

వ॥ ఇట్టి యఖిలలోక సమ్మోహనం బగు వసంతంబున నొకనాఁడు ప్రాతః
కాలోచితకృత్యంబు లొనర్చి సుఖాసనాసీనుం డగు నందయ్యకడకు
భయవినయసంపన్నుండై భృత్యుం డొకం డేతెంచి చిరునామాచీటి నొక్క
టొసంగి యొకమానిసి దర్శనాభిలాషియై సోపానమ్ములకడ వేచియుండె నని
చెప్పిన నతం డాచీటిం బరికించి, తన్నామాంకితుం బోల్చుటకు యత్నిం
చియుం బోల్చుకొనఁ జాలక వానిం దోడ్కొని రమ్మని భృత్యు నంపి వానికై
యెదురు సూచుచున్నంత. ౩౯

ఉ॥ గౌరవమున్ గళాకలిత♦కాంతియు, నైజ దరస్మితమ్ము నే
పారఁగ మోముసీమ విన♦యమ్ముఁ బ్రియమ్మును నొక్క వింత సిం
గారము ఠీవియున్ నడల ♦ నాట్యమొనర్పఁగ సద్యశస్సతీ
చారుమనఃప్రియుండు, కవి♦చంద్రుఁ డొకం డరుదెంచి మచ్చికన్

తే॥గీ॥ వందనమ్ములు గావింప ♦ వాని కెదురఁ
జోత లర్పించి లేచి కూ♦ర్చుండుఁ డంచు
వినయమునఁ జెప్పి యవ్వానిఁ ♦ బృచ్ఛచేయు
విధము వెదకుచు నుండ నా ♦ వృద్ధుఁ డంత. ౪౦

తే॥గీ॥ అపరిచితుఁ డయ్యుఁ బరిచితు ♦ నట్ల యతఁడు
చిఱునగవుతోడ 'నందరు ♦ సేమమా? వి
శేషములు లేవు కా, మన ♦ శ్రీధరునకుఁ
బిల్లలా? యాతఁ డేమి కా♦వించుచుండె.' ౪౧

తే॥గీ॥ అనఁగఁ దలఁ ద్రిప్పి ఊఁ యని ♦ యూ నటంచు
సందియమున జవాబిచ్చు ♦ జరఠుఁ గాంచి
'నన్ను గుర్తించినారె? మ♦నమ్మునందు
మఱచినారా?' యనంగ నా ♦ జరఠుఁ డనియె. ౪౨

తే॥గీ॥ 'చూచినట్లుండెఁ గాని, యీ ♦ చోటనో మ
నమ్మునకుఁ దోఁపకున్న దై♦నను మహోగ్ర
కష్టతతి నోర్చితి, నదియుఁ ♦ గాకఁ దాంటి
శేముషీశక్తి లేనాఁడు ♦ చెలఁగు టెట్లు?' ౪౩

తే॥ గీ॥ అనినఁ గవి 'తాము పనిచేయు ♦ నవసరమునఁ
గొండవీట వధాన మొ♦కండు జరిగె
దాని కీరును దయచేసి ♦ మానసమున
ననుఁ బ్రమోదాబ్ధిలో ముంచి♦నారు నాఁడు.' ౪౪

తే॥ గీ॥ అన నతండు 'కళానిధి♦వా! మఱెవ్వ
రో యటంచుఁ జూచుచునుంటి, ♦ నీయెడ కెపు
డేగుదెంచితి? యిటకు రా♦కెందు నుంటి?
వేమి వార్తలు సెప్పుమో♦యీ' యనఁ గవి. ౪౫

తే॥ గీ॥ పాఠశాలాంధ్రపండిత♦పద మొసంగి
నారలీ యూర నది గొని♦నాఁడ నిన్న,
వచ్చితిని మిమ్ముఁ జూచిపో♦వంగ బాంధ
వులును బెద్దలు మాకు ము♦ఖ్యులును నగుట. ౪౬

ఉ॥ హోటలులోన బోనమగు ♦ చున్నది, యుండుట కొక్క రూము మీ
పేటను గాదు నేమొ యని ♦ వీక్షణ సేయుచునున్న వాఁడ నా
పాటులెకాని యున్నదను ♦ పల్కు వినంబడ రాదు మిత్రుఁ డి
వ్వీటఁ గలం డొకండు సుక♦విప్రముఖుం, డట నుంటి నింతకున్. ౪౭

వ॥ అనిన విని నందయ్య యెయ్యదియో పలుక నెంచియు సంశయించి, తిరిగి కళానిధిఁ గాంచి, 'నీవు మఱొండుగా భావింపకుము. నే నొకటి చెప్పెదఁ గైత యనఁ బూర్వభవపుణ్యావశంబునం గాని ప్రాపింప, దది ప్రాప్తించినను అవధానశక్తి యబ్బుట దుస్తర, మదియుంగూడిన నాశుధార యలవడ, దది యలవడినను శ్రావ్యంబుగా నుండ, దివియన్నియు శ్రీపరాంబా కటాక్షంబునంజేసి నీయెడ సమగ్రంబులై యుండెఁ గావున నీ వేయుద్యోగ మొనర్చినను అవధానశక్తిఁ గోల్పోవకుము. ౪౮

ఉ॥ నాఁడు సమస్య నొండు గణ ♦ నమ్మగ నిచ్చితి నీకు, నీవునుం
బ్రౌఢరసావిశేషములు ♦ వాటిలఁ బూరణఁ జేసినావు, మా
వాఁడవు కుఱ్ఱవాఁడవు స్వ♦భావకవిత్వవచోమనోజ్ఞతా
గాఢవధాని వౌటఁ గుతు♦కమ్మలరెన్ నినుఁ జూచినంతనే. ౪౯

తే॥ గీ॥ నాఁటివాఁ డనుకోకు మీ♦నాఁడు నన్నుఁ
బ్రబలమఃఖాంధకారప్ర♦పంచమందు
సురిగి కాలమ్ము నెట్టొ త్రోయు♦చుంటి నకట
సాధ్వియౌ దానితోడ నా ♦ సౌఖ్య మరిగె. ౫౦

సీ॥ దాఁటె నేఁటికి సుమీ!♦ తత మనోజ్ఞవిలాస
కవితాలతాంగసు♦ఖ ప్రసక్తి
యంతరించెను సుమీ ♦ యనవద్యహృద్యసం
తతగానవీచికా ♦ నందవిహృతి
తొలఁగిపోయెను సుమీ ♦ దూరదేశాగత
పండిత తర్కశ్ర♦వణ వినోద
మడఁకమైనది సుమీ ♦ యంబికాకళ్యాణ
సమయమత్కృతమహో♦త్సవవిధాన
తే॥ గీ॥ మరిగె భక్తసమాజకా♦ర్యమ్ము లెల్ల
దానితోడ, నుద్యోగప♦దమ్ము గూడ
వదలితిని దానితోడ. భా♦వమ్ము నందు
నుత్సుకతయును దగ్గిన♦దోయి వత్స!’ ౫౧

క॥ అని తన యెదవ నెలఁతుక
గొనములఁ దలపోయుచుఁ గను♦గొలఁకుల నీర
మ్మును గోటనె తుడుచుచు ను
స్సని నిట్టూర్పుల నిగుడ్చు♦నాతనితోడన్. ౫౨

తే॥ గీ॥ మోమున విషాదరేఖలఁ♦బ్రోదిఁజేసి
‘ప్రాణులకుఁ బుట్టి గిట్టుటల్ ♦ సహజగుణము
లవ్వి భగవద్విలాసమ్ము ♦ లై యొసంగుఁ
దమ రెఱుంగని దేమున్న ♦ దమలచరిత! ౫౩

ఉ॥ పుట్టువుకన్న మున్ మరణ♦మున్ విరచించి విధాత జన్మమున్
బట్టముఁ దీర్చె దానిఁ గొని ♦ ఘాతికనాటక మాడి యాడి లో
గుట్టు నెఱుంగలేక కడ♦కున్ గొఱమాలి నశింతుర్జీవు లె
ప్పట్టున నైన యంచు భగ♦వంతుఁడు క్రీడికిఁ జెప్పె వింటిరే? ౫౪

తే॥ గీ॥ కాన మిముఁబోలువారు శో♦కమున కింత
సందు నీరాదు గీతల♦యందుఁ గలవు
విశ్వవిశ్వంభరానాట్య♦వీథిలోని
చిత్రముల తత్త్వ మెల్ల వీ♦క్షింపుఁ డనఘ!' ౫౫

వ॥ అని దుఃఖోపశమనం బొనర్చు కళానిధిం దేఱిపాఱం జూచి నందయ్య 'నీకు గీతలలోఁ బ్రవేశంబు కలదా' యన నతఁ డొక్కింత కలదని వచింప వృద్ధుం డానందంబున సాంఖ్యంబుం గూర్చి ప్రశ్నింపఁ గవి సదుత్తరంబు లొసంగు సమయమ్మున, ౫౬

సీ॥ పడకలోపలఁ బ్రక్కఁ♦బడి యొత్తిగిలఁ గొంత
నలిగిన జిలువు దు♦వ్వలువతోడఁ
దళుకు నొక్కులు దేర ♦ మలచిన మోమునఁ
గెరలి క్రేళ్ళుఱుకు ముం♦గురులతోడఁ
జదువుచో నయనాంబు♦జముల మోడ్పుచెలంగఁ
గ్రమ్మిన నిదురమై♦కమ్ముతోడఁ
బఠియించు పుట కొన♦వాలు వ్రేలిడి వ్రేళ్ళ
గమిచిపట్టిన పుస్త♦కమ్ముతోడ

తే॥ గీ॥ వాలుగా నేల జీరాడు ♦ పైటతోడ
సొబఁగు వెలిఁజిమ్ము వలపు వా♦ల్జూపుతోడ
మొగిళులందలి మెఱుఁగుల ♦ మురువనంగఁ
గమలయాతని కపుడు సా♦క్షాత్కరించె. ౫౭

వ॥ ఇట్లు సాక్షాత్కరించిన.

చ॥ పులకితమైన మానసము♦పొల్పు మొగమ్మున దోఁపనీయ క
గ్గలమగుకూర్మి నిబ్బరము♦గా జరఠుండు గ్రహింపలేని చా

యలఁ గని వియ్యమందిన యపాంగములన్ దదనూనయావనో
జ్వలసుధఁ గ్రోలుచుండె సరసజ్ఞుఁ డతం డొకవంకఁ బల్కుచున్. ౫౯

వ॥ ఆమెయు.

మ॥ తరళాలోకన మోహనాస్త్రతతి చేతన్ దన్ను నొప్పించి హృ
త్సరసీజమ్ము హరించి తా నుపనిషచ్ఛాస్త్రార్థ తాత్పర్య భా
వరహస్యంబులఁ బూసగ్రుచ్చినటులన్ వాక్రుచ్చి, స్వీయేశు న
చ్చెరువున్ బొందఁగఁ జేయు వానిచెలువున్ జిత్రమ్మునాఁ జూచుచున్.

తే॥ గీ॥ కొదమతుమ్మెద కముపులు గూళ్లుపెట్టు
ముంగురుల చాయలం బడి తొంగిచూచు
తన్మనోహర వదనపద్మమ్ము నరసి
మెచ్చి తలయూఁచి లోలోన వెచ్చనార్చి. ౬౦

వ॥ తమకం బడంప యత్నించుచుఁ దదధీనమనస్కయై యున్నయెడ
నందయ్య యుబ్బసంపు దగ్గుతెరచే బాధపడు స్వల్పకాలంబున.

తే॥ గీ॥ గబ్బిగుబ్బలఁ బులకలు గడలు కొనఁగఁ
జిత్త మతులితాభీష్ట వీచికలఁ దేలఁ
గనులు విస్ఫార వలపులఁగని యనంగఁ
గాంచు నామోహినిం గాంచి కవివరుండు. ౬౧

చ॥ వలపు పిసాళి తళ్కునిడువాల్గనుదోయిని దాండవింప నూ
ర్పులఁ దమకం బెసంగ మెయిఁ బుల్కలు నిండ, మిటారి గబ్బిగు
బ్బలు చెలఁగన్ దనంతఁదన భావసుమమ్ము నొసంగు కామినిన్
వలదను నే? యతీంద్రుఁడయినన్ లభియించు నె యిట్టికూరుముల్. ౬౨

మ॥ అనుచున్ లోఁ దలపోయ నాశుకవితాఖ్యాతావధానస్ఫుర
ద్ఘనమేధావిధులన్ నృపాలతతిసత్కారమ్ములన్ గాంచు నా
తని కన్నుల్ నయనావధానమహిమాధారమ్ములై యొప్పె, మో
హనశృంగారరసాధిదేవతకు నాహ్లాదమ్ముఁ గల్పింపఁగాన్. ౬౩

వ॥ ఇట్లు కవి కనుసైగ నొనర్చిన తత్క్షణ మామెయు,

తే॥ గీ॥ జలదరించిన తనమేని♦చెలువు తడివి
కట్టెమటు నున్న మోహనా♦కారుఁ గాంచి
గుట్టుమట్టులు దడదడ ♦ గొట్టుకొనఁగ
నతనికి జవాబుగా నుత్త♦మాంగ మూఁపె. ౬౪

వ॥ అంత నిది గ్రహింపలేని నందయ్య కళానిధివాక్కుల కలరి యిట్లనియె.

ఉ॥ పిన్నవు ప్రాయమందునఁ గ♦విత్వమునందునఁ బేరుగాంచితి
పెన్నఁగ భాష్యమందుఁ గల ♦ దియ్యదియంచు వచించుచుంటి, వ
త్యున్నత శబ్దశాస్త్ర మహి♦తోదధి నెట్లు తరించినాఁడ వీ
తెన్ను వచింపు మచ్చుఁపుగ♦తిన్ భవదీయగురుం డెవండొకో. ౬౫

చ॥ అనఁ గవి ధ్యానపూర్ణనయ♦నాంబుజనీమల నీరుగ్రమ్మ మ
జ్జనని పరాంబ శాస్త్రయుత ♦ చారుకవిత్వ మహత్వతత్త్వ సం
జనితయశఃప్రభావునిగ♦నల్పిన దామె పదాబ్జముల్ మన
మ్మున విలసిల్లెనేని గురు♦వుల్ వలెనా కవినాథుఁడొంటరున్ ? ౬౬

తే॥గీ॥ స్వర్ణముగ్రేశ్వరీపాద♦పంకజాత
మధుపమై పోవఁగాఁజాలు ♦ మానవుండు
విపుల శాస్త్రసుధాసింధు ♦ వీచికావి
హారమొనరించు టన నొక ♦ యబ్బురంబె ౬౭

తే॥గీ॥ అన ముదంబంది యతఁడు వే♦దాంతచింత
నమ్మెనర్పంగఁ బెద్దకా♦లమ్మునుండి
కోరుచుంటి నర్వాం డొన♦గూడకుండె
నేఁటి కబ్బితివయ్య నా♦మాట వినుము. ౬౮

తే॥గీ॥ ప్రాఁత పడినట్టి పుస్తక♦రాజియెల్లఁ
బైకిరావచ్చు నింక, మా♦భవనమంద
యుంట కేర్పాటుఁజేసెద ♦ నునికి నిటకు
మార్చుకొను మోయి యీనాఁటి ♦ మాపులోన. ౬౯

క॥ అదియేఁ గాలక్షేప
మ్మదియేఁ గావింపవచ్చు ♦ హృదయము శాంత్యా
స్పదమగు నాకును మఱి నీ
కిది చేటికయగుఁ గదయ్య ♦ యెల్లటి కనుడున్. ౩౦

వ॥ ఆపలుకులు కర్ణానందంబులైనను గవి పయికి.

తే॥ గీ॥ పెద్ద లటులాడఁ బిన్న నే ♦ విధి వచింతు
ననిన జరఠుండు నీమ ప్రా ♦ యం బదెంత
యనఁగఁ గవి వింశదబ్దంబు ♦ లరిగె నంచు
నుత్తరమొసంగి పిదప నా ♦ యత్తుఁ డగుచు. ౩౧

తే॥ గీ॥ సెల వొసంగుఁడు బడికేగ ♦ వలయు నంచు
జరఠుతోఁ బల్కి, వలపుపి ♦ సాళితళుకు
వాలుజూపులఁ జిమ్మి వీ ♦ డ్కోలు వడసి
కమల చెంగట నరిగె నా ♦ కవి రయాన. ౩౨

వ॥ అంతఁ గొంతతడవునకు నందయ్య దాసినిఁ బిలిచి సోపానకవాటమ్ము బంధించి మీయమ్మగారిని బిలువ మనుటయు నదియు నట్లొనర్చి కళానిధి వెడలుటతోడనే మెలమెల్లఁ బానుపుం జేరి యతని మోహనాకారమ్ము హృదయఫలకమ్మున మననం బొనర్చు నాపాలంతికి ధవునానతి నెఱింగించిన విని తుళ్లిపడి లేచి. ౩౩

తే॥ గీ॥ కాల్కదల్చిన గజ్జెలు ♦ ఘల్లురనఁగఁ
జెంగునన్ వచ్చి యౌవన ♦ శ్రీ విధ్వస్త
బొమలు ముడివైచి నిలుచున్న ♦ సుదతిఁ గాంచి
జరఠుఁడనె నూర్పుఁ బుచ్చి ♦ యోజన చెలంగ. ౩౪

వ॥ మన మూఁడవయంతరువుపైఁ బుస్తకాగారంబుపొంత గది యలంకరింపించి యం దాసనాద్యుపకరణమ్ము లమర్పించి యటనుండి నేరుగా వీథి కేగు సోపానకవాటము దాళముఁ దీయించి మన శయనగృహమ్మునుండి పుస్తకాగారమ్మున కేగు కవాటము బంధించి తాళంపుఁ జెవి నా

కీయు మను వృద్ధుని వాక్కుల విని లో నిరికలెత్తు కోరికల పొంగడంచి యాజాణ 'యీ యేర్పాటు లెంచుల' కన నతండు. ౭౫

తే॥గీ॥ నన్నెఱిఁగినవాఁ డొకఁడు నూ♦త్నమ్ముగాఁగ
నెదియొ పనిమీఁద వచ్చె ని♦య్యెడ కతండు
పడఁతి! కొన్నాళ్లు మనమేడ♦ పైన నుండు;
నుండుఁ గాకేమి మనకేమి ♦ యుండులోటు? ౭౬

వ॥ అన నామె యతం డేమిటవాఁ డింపుల కేకార్యమ్మున కేగుదెంచె ననవుఁ డతం డతండు మనకు దూరపుబాంధవుం, డదియుంగాక నతం డందరియట్టివాఁడు కాఁడు వినుము. ౭౭

ఉ॥ శాంతుఁడు నంబికాచరణ ♦ సారసభృంగ మనూనమోద వే
దాంత విరాగభావుఁ డమ♦లాబ్జముఖీవిముఖుండు దిక్తటా
క్రాంత యశోవిశాలుఁ డభి♦రామవధానవిధానధారణా
శ్రాంతవిలాసమూర్తి కవి♦రాజు కళానిధినాముఁ డంగనా! ౭౮

వ॥ మఱియు.

సీ॥ ఆశుధారాకవి♦త్వానంద మాయన్నఁ
గులతలోదరి తొలి♦గోష్ఠి కాఁగ
నష్టావధాన వి♦ద్యావిలాస మటన్న
జవరాలి వలపు క♦న్సైగ కాఁగ
శతవధాన విధాన ♦ చాకచక్యం బన్నఁ
గలికికూకూనాద ♦ కలన కాఁగ
దిన మొక్క పుస్తక♦మ్మును రచించుట లన్న
బిబ్బోకవతిజడ♦వ్రేళ్లు కాఁగఁ
తే॥ గీ॥ దనకు జ్యోతిషమంత్రశా♦స్త్రవ్రజమ్ము
లెలమి ననురాగవతుల కౌఁ♦గిళులు కాఁగ
నా పరాంబాపదంబు సా♦యంబు గాఁగ
దిరిగె దేశాలు నృపులస♦త్కృతుల నందె. ౭౯

తే॥ గీ॥ ఈయవియె కాక వాని కె♦న్నేనిఁ గలవు
స్వర్ణదుర్గాంబికాకృపా♦ప్రాప్త శక్తు
లన్నిఁటికి నేమిగాని వే♦దాంతమంద
యతని చిత్తమ్ము దవులు ని♦రంతరమ్ము. ౭౦

వ॥ అతం డిట్టివాఁ డగుటయే మనగృహమ్మున నుండఁగోరితి నను పతిమాటల కలరియు మోమున దైన్యం బుట్టిపడ నాకలకంఠి యిట్లనియె.

ఉ॥ ఎట్టి కృపావిహీనమతు ♦ లీయురి నామెడకున్ దగుల్పఁగా
నెట్టు దలంచినార? లెటు ♦ లేగుదు నాగదిచాయఁ? బుస్తకా
లెట్టు గ్రహింపఁగాఁ గలఁ? బ ♦ ఠించెద నెట్టులు? నింతమాత్రమేన్
దట్టకపోయె మీ మదికి ♦ నా దురదృష్టపుకల్మి నక్కటా! ౭౧

ఉ॥ బంధన లెట్టు లున్నను జి♦వా ళ్లెటులున్న మ రెన్నియున్న నే
గ్రంథమునో పఠించుకొని ♦ కాలముఁ బుచ్చుచు నున్నదాన, నా
చందముఁగూడ మీరు కొన♦సాగఁగనీ కరికట్టుచుండిరి లో
సందియ మందరా? కవు ల♦సాధ్యు లనన్ వినరా ధరాస్థలిన్? ౭౨

తే॥ గీ॥ ఏను వలదన్నమాత్ర మీ ♦ కేమి లెక్క
మీకుఁ దోఁచినకార్యముల్ ♦ కాక నిలుచు
నా? యెవని నెందు నుంచుకొ♦న్నను మదీయ
పఠన మాపఁగ నెంచఁగా ♦ వలదు మదిని. ౭౩

క॥ అని గబ్బిగుబ్బల నయన
జనితాశ్రుకణమ్ము లురలి ♦ చాల్వారఁగ స
న్నని యెలుఁగున ధవు మదిఁ జీ
ల్ప నేడ్చె; నేడ్పె చెలుల కభి♦వాంఛద మాగా.

వ॥ ఇట్లాలతాంగి యేడ్వ నతండు నిశ్చేష్టుండై క్షణకాలంబుండి పెల్లుబ్బుకనికరమ్మున నిజస్థితిం దలంచి

చ॥ అనువుగఁ జేరఁదీసికొని ♦ యాదలపైఁ జెయి వైచి గడ్డముం
బుణుకుచు, బుజ్జగించుచుఁ గ♦పోలము లంటుచు, నీదు వాంఛిత

మ్ము నడువు మేదిరియైనఁ బువుఁ♦బోఁడి! ఘటించెద నేఁడ్వె నేల నీ,
కని నయగారపుంబలుకు ♦ లాడుచునుండ లతాంగి తీవ్రయై. ౨౫

ఉ॥ చేయి విదల్చి పైచి యొక♦చెంతకుఁ బోయి నిరుద్ధకంఠయై
యీ యఖిలమ్ము నాకునయి ♦ యేర్పడఁజేయుచునున్నవారు, నా
కే యభివాంఛితమ్ము కల♦దేఁ బఠనమ్ము నొనర్చుకొంచు సౌ
ఖ్యాయతచిత్తనై మెలఁగు♦నట్టు లొనర్చుట, సర్వ మిచ్చుటల్. ౨౬

చ॥ అన విని విచ్చియున్న హృద♦యమ్మున కించుక శాంతి తోఁప ని
ట్లనియె నతం, డతండు గది♦యందు మెలంగనివేళ, నీను వాం
ఛను నెఱవేర్చుకొమ్మనినఁ,♦ జాన చురుక్కున వానిఁ జూచి, యి
ట్లనువగు, నాయభీష్ట మక♦టా! తమచెంగట బీగ ముండఁగాన్. ౨౭

వ॥ అనిన వృద్ధుండు బీగమ్ము నా క్రియకు; మేను చెప్పిన చొప్పునఁ బ్రవర్తింపు మనినఁ గమల వల్లె యని, పతివాక్యానుసారిణియై, కళానిధి కొఱకేర్పాట్లఁ గావించుచు సంధ్యాసమయమ్మున కెదురుచూచుచున్నంత. ౨౮

మ॥ అతులోదారమహత్త్వశీలగుణపూ♦తాత్మల్ వివేకల్ పతి
వ్రతలే పొందిన దేశమందునసె కూ♦ళల్ భర్తృవిద్రోహ లీ
గతిగా నొప్పినవా రటంచు నినుఁ డు♦గ్రస్వాంతుఁడై కాంచె నాన్
దత సింధూరరుచిచ్ఛటావళులు వ్యా♦ప్తం బయ్యె దిక్సంతతిన్. ౨౯

చ॥ జరఠుఁడనైన నన్ను నెఱ♦సంజల నింటికిఁ జేరిరన్ బరా
మరిక యొనర్ప కాననము ♦ మాడ్చును వేగెపు డేగుదెంచు నం
చరయుచునుండుఁ బశ్చిమది♦శాంగనకో యని యెంచి వృద్ధభా
స్కరుఁడు క్రుధాననుం డయిన♦చాడ్పున రక్తిమఁ దాల్చె, దిక్తటుల్. ౩౦

సీ॥ తప్తహేమాచలో♦ద్యత్కూటము లనంగఁ
గళ లీను చిఱుమబ్బు♦గములు కొన్ని
అఖిలేశ్వరీపాట♦లాంబరాంచలములఁ
మ్రిల్లింతలాడు మొ♦యిళ్లు కొన్ని

పద్మినీపరిణయశ్రీ♦పరసావిశేషశ్రీ,
ణమయమ్ములగు పయో♦దములు కొన్ని
ద్రోహామందేహాసం♦దోహరక్తారవా
ర్ద్రివిహారజీమూత♦తతులు కొన్ని

తే॥గీ॥ నిరతదేశాటనాయాస♦భరితతీక్ష్ణ
కరనిజాస్యారుణచ్ఛాయఁ♦గెలుజలద
జాలములు కొన్ని చిత్రలా♦స్యము లొనర్ప
సాగె, నాకాశనాటక♦శాలయందు. ౯౧

ఉ॥ పయ్యెద లంటి. యాపయినఁ♦బాదము లంటి, కుచమ్ము లంటి నున్
దియ్యనిమోవు లంటి, రమ♦ణీయకపోలము లంటి ముంగురుల్
చయ్యన నంటి సంజ, బయ♦లన్ దటినీతటులన్ జరించు న
త్తొయ్యలులన్ గలంచెఁ దమి♦తో మలయానిలసూనుఁ డయ్యెడన్ ౯౨

తే॥గీ॥ కర్మఠుల కెల్ల వార్చెడు♦కాల మగుచు
విమలవిజ్ఞానులకు లోని♦వెల్తు రగుచుఁ
గాముకులపాలి ప్రణయరా♦గంబు నగుచుఁ
జదల వ్యాపించెఁ గ్రొన్నెఱ♦సంజసంచు. ౯౩

———

ఓమ్.

శ్రీమ త్పురాంబికాయై నమః.



శ్రీ

# రసాశ్రయము.

## ౨ వ దళము.

తే॥ గీ॥ కమ్మనైనట్టి యాసమ♦యమ్మునందు
శకటమును డిగ్గి సోపాన♦సరణి వచ్చు
కవిని వీక్షించి నందయ్య ♦ కౌతుకమున
రమ్మ! దయచేయు మని యిటుల్ ♦ పలుకఁదొడఁగె. ౧

తే॥ గీ॥ మేడపై గదిలోపల ♦ మీర లుండ
ననువు జేయించితిని జల♦యంత్ర మున్న
దండె, వీథికి మెట్లున్న ♦ వటులె మీర
లిచ్ఛమై రాకపోకల ♦ నెసఁగవచ్చు. ౨

తే॥ గీ॥ అడుగుఁ డేమేనిఁ గావలె♦నన్న వాని
నమరఁ జేయింతు ననఁ గవి ♦ యనియె నిట్లు
వలయు నింకేమి శాంతిమై ♦ మెలఁగఁదగిన
తా వొసఁగ రంతియే చాలు ♦ ధన్యమూర్తి! ౩

వ॥ అని వినతుండైన వృద్ధుండు మంచిది మీ రందు సామాను బెట్టించి భోజనానంతర మొకతూరి కలియుండని, యాగదితలుపుఁ దీయ దాసి కొన తీయఁగవి చిత్తమని క్రిందికి డిగి, తృతీయాంగణంబుఁ జేరి, తనకొఱ కేర్పరచిన గదిఁ జొచ్చి, యందుఁగల శయనాద్యుపకరణంబుల నీక్షించి, జలయంత్రాది సౌకర్యమ్ముల కానందించి, యటకు దుర్గాలయమ్ము పొడఁగట్టుచుంట భాగ్యంబని యెంచి, పేటికయుఁ బరుపును నుచితస్థలమ్మునం దుంచి, వలయు పరికరంబులం గైకొని స్నానం బొనర్చి, సంధ్యాదికృత్యమ్ముల ముగించుచున్నెడ, దాసి యొక్క రుక లాంతరుఁ దెచ్చి, యందుంచి పోవ దాని వెలుఁగున టిక్కు టిక్కుమను గడియారముం జూచి యేడున్నరగంట యగు టచేఁ బూటకూటింటికిఁ దఱియగుచున్న దని వేషము మార్చి, పీతాంబరంబు బుజమున వైచుకొని తలుపునకున్ దాళము వేసి శ్రీదుర్గాలయముదిక్కై ప్రణా మిల్లి నల్దెసలఁ గ్రమ్ముకొనివచ్చు నెఱికప్పుచీఁకటిఁ గాంచి తనమనంబున.

తే॥గీ॥ శాంతభక్తివిరాగవి◆జ్ఞానమూర్తి
నకట, యౌవనోన్మత్తగా◆ఢాంధకార
మొరసినట్లు, భాస్కరు పరా◆మరిక నలరు
కాంత దిక్కాంతతతులఁ జీఁ◆కట్లు గ్రమ్మె. ౫

తే॥గీ॥ కవియు భక్తుండుఁ జిత్రలే◆ఖకుఁడు, జ్ఞాని
సాబఁ గెఱుంగుదు రిల నిశా◆సుందరీ! భ
వత్ప్రణయమున కర్హులు ◆ వారిభావ
నాప్రపంచము నినుఁ గూడి◆నన్ రహించు. ౬

తే॥గీ॥ కలదు నీలోపలను వెల్గు ◆ వెలుఁగులోనఁ
గలదు నీతళ్కు సంసార◆కాననాంత
రభ్రమణశీలు రేదారు◆లన్ గ్రహింపఁ
జాలెదరు నీసుఖమ్ము ని◆శావధూటి! ౭

మ॥ అని యేమేమొ మహాశుధారకవితా◆వ్యాపారతన్ బాడి, భో
జనమున్ జేసియు వచ్చి నందయకడన్ ◆ సంభాషణన్ జల్పి త

ధ్వనితారత్నము వైఖరిన్ గని ♦ నిజావాసంబునుం జేరి, తా
దినకృత్యమ్ముల నెంచఁగాఁ దొడఁగె శాం♦తిన్ ధారణాధ్యోరణిన్. ౮

తే॥గీ॥ తా నుదయమాది సలిపిన ♦ తగనిపనులఁ
దలఁచి తత్పాప మడఁగ డెం♦దమ్మునందు
స్వర్ణదుర్గాపదధ్యాన♦చర్య జరిపి
వృద్ధసతి యెంచి విజ్ఞాన♦హృదయుఁ డగుచు. ౯

ఉ॥ కన్నులు పాపకారణము ♦ కావనఁజాల, మనమ్ముకూడ, యా
తెన్నున నేగి, మోహసము♦దీర్ణపయోనిధి మున్గి, యౌవన
ప్రోన్నతవీచికోపరిఁ బ్ర♦మోదముమై నడయాడి, యంత్యమం
ము న్నిరయాగ్నికీలములఁ ♦ ద్రోయు మదేంద్రియబద్ధజీవులన్. ౧౦

తే॥గీ॥ భ్రమసి కనుగీట నేను శీ♦ర్షమ్ము నూఁపి
తగుసమాధాన మొసఁగు చెం♦దమ్మె వలచె
నా మెయు నటంచుఁ దల్పు నే♦మైన నన్నుఁ
గలుషమునఁ ద్రోయకమ్మ దు♦ర్గాభవాని! ౧౧

తే॥గీ॥ అనుచుఁ జింతించి వృద్ధ క♦ళ్యాణభూత
ములు తలంపులఁ దాండవ♦మ్ముల నొనర్పఁ
దతవిచారాతిరేకవి♦ధానమాన
సమున మురపిల్లి యి ట్లన♦సాగె నతఁడు. ౧౨

ఉ॥ కన్నియలన్, వయోగుణవి♦కాసల, హాసవిలాసరూపసం
ఛన్నల, గాననాట్యముఖ♦చారుకలాకలనాతిరేకసం
పన్నల, శీలసత్యనయ♦భావల, వృద్ధజనార్ధదేవికిన్
గ్రన్నన నిచ్చుచుండ్రి బలి♦గా నవివేకులు పెండ్లిజాతరన్. ౧౩

మ॥ అదిగా కొందఱు పూర్ణయౌవనమదో♦ద్యద్భావలోకాంత లిం
పొదవన్ జారనఖక్షతాదికకళం♦కోదీర్ణలై గౌరవా
స్పదవంశమ్ముల బూదిలోఁ గలిపి భ్ర♦ష్టప్రేమలై పోవుచుం
డ్రి ధనాశాపథులైన స్వీయపితృని♦ర్దిష్టవ్యథోపేతలై. ౧౪

క॥ ఓతల్లిదండ్రులారా!
కూతుల నవసౌఖ్యలతల గోళ్ళఁ జిదిమి, దు
శ్చేతలఁ బాతివ్రత్య వి
ఘాతలఁగాఁ జేయఁగాఁ దగవె యీరీతిన్? ౧౫

ఉ॥ వారల ఘోరపాపములఁ బొల్పిడి మీకును, రౌరవాదివి
స్తారమహోగ్రనారకవితానములన్ బడఁద్రోసి, బాధల
వ్వారిగఁ గూర్పనెంచు సమవర్తి యటంచుఁ దలంపరేల, మీ
పేరును బెంపు మాపఁగల వృద్ధవివాహము లేల? చెప్పుఁడీ. ౧౬

సీ॥ పాల్గారుచెక్కిళ్ళపట్టి విశ్వస్తయై
వగవఁ బిల్లలతల్లివయసు తగ్గ
నవయౌవనాత్మజాత విధవయై యేడ్వ
బిడ్డలుకలతండ్రి పెండ్లియాడు
ముకుపచ్చలారని పొలఁతి యనాథకా
నక్కసెల్లెండ్ర యాజ్ఞాళి హెచ్చ
లలితకళాంగి చెల్లెలు బోసకత్తెగాఁ
దచ్ఛ్రీలఁ గుడుచు సోదరుఁ డెసంగఁ

తే॥గీ॥ బ్రసవకోమలి తమయింటఁ బడి కృశింపఁ
దాము భోగాంగనాసుధాధరమరంద
పానమత్తులై యిలు సేరవార లెంద
రో; వచింపఁ దరంబె, యీ రోజులందు. ౧౭

ఉ॥ సమ్మతి నెన్నియేండ్లొ, సరసమ్మెసఁగన్ నిజమాననేచ్ఛ స
ర్వమ్మును దీర సంతతియురాజిలు పెద్దలె యెంతయేనిఁ గా
మమ్ము జయింపలేనపుడు మానససీమఁ గుమారి, మారుగ
ర్వమ్మెటు త్రోయునో యనుభవజ్ఞులు వాకొనుఁడీ, ధ్రువమ్ముగన్,

శా॥ ఏమీ రెండవ పెండ్లివాఁడు బురుషుం డేలా ప్రయత్నించు, నా
యామోదంబె సతీవితానముల కేలా కూడదం చాడుఁ, దాఁ

"గామ శ్చాష్టగుణం భవే" త్తనెడు వా◆క్యమ్ముల్ వితర్కించునే
నీమైవాదనలఙ్ బొనర్చునె, యెవం◆డేకాని, లోకమ్మునన్. ౧౯

తే॥గీ॥ ఇచ్ఛయందుఁ బూరుషునకన్న ◆ నెనిమిదింత
లధికమఁట, పెద్దయంట సా◆హసము జవ్వ
నం బఁట, వియోగినియఁట సు◆మాస్త్రిబారిఁ
బడ దఁటన నీయుగమ్మున ◆ స్వప్నవార్త. ౨౦

తే॥గీ॥ మోడుమ్రానైనఁ జిఱుమొగ్గ ◆ మోసులెత్తఁ
దల నెగురవైచుఁ బికకూజి◆తముల వించు
నవ్యకుసుమోదయ మ్మగు ◆ నాఁడు, దాని
వల దటం చరికట్టు వా◆రలు గలారె? ౨౧

తే॥గీ॥ మొగ్గ దొడిగి రేకులు వైచి ◆ నిగ్గుఁ దాల్చి
తొణఁకని మరందధారల◆ తోఁ దలిర్చు
నూన మేక్రియ వాసన ◆ లూనకుండుఁ
బ్రకృతి బంధింపఁగలఁడె యె◆వ్వాఁడుగాని ? ౨౨

తే॥గీ॥ అసుమము మోడువారుచు ◆ ననద యగుచు
జీర్ణవాంఛలతోడఁ గృ◆శింపఁగలదొ
కాక, పాపాలయం బయి ◆ కడకు నరక
నాథునింగూర్చి చనునొ, యెం◆చంగ వలదె. ౨౩

తే॥గీ॥ రమ్యవిధవావివాహమా◆ర్గమ్ము విడచి
యనద లగువారి భ్రూణహ◆త్యావ్రజమ్ము
నందుఁ బాల్గొనుమీకు నా◆నంద మెచట?
నిం దపయశమ్ము, నందు వ◆హ్నియు ధ్రువమ్ము. ౨౪

తే॥ గీ॥ పెండిలిఁ బ్రపంచవృద్ధికై ◆ విధి విధించె
నది యనూనానురాగసం◆పదఁ దనర్చి
యమరఁజేయునరు నిట, నొం◆డైన కొర
వసదృశమె జీవి కంచు శి◆వన్ దలంచి. ౨౫

మ॥ జననీ! యిందను కే లతాంగిని నిరీ◆క్షన్ జేసి కామింప నేఁ
డనరానట్టి యఘమ్మునన్ సలుపఁ గ◆ట్టా సుంత యోజించినాఁ
డను దత్పాపమె వేయురెట్టు లగుఁ ది◆ట్టంబోక, కారుణ్యవీ
క్షణలన్ నన్నుఁ బవిత్రుఁ జేయుము, నమ◆స్కారమ్ము దుర్గేశ్వరీ! ౨౬

మ॥ ధరలో నా యనుదాన వీవనుచుఁ జై◆తన్యంబ వీవంచు నీ
కిరవై యున్న ప్రపంచరంగమున కీ◆వే సాక్షి వంచున్ నిరం
తరమున్ దావకపాదపద్మములు లెదన్ ◆ హత్తించి పూజించు నా
నెఱసుల్ త్రోచి, యనుగ్రహింపఁదగు రా◆జ్ఞీ! స్వర్ణదుర్గాంబికా ౨౭

తే॥గీ॥ అస్ఖలితనిష్ఠతోడుత ◆ నరిగె నింత
దనుక వింశత్సమల్ భవి◆తవ్య మిటులె
జితమదేంద్రియానూనసం◆శీలుఁ జేయు
మంబ! తావకాశీర్మహ◆త్త్వంబుబలిమి. ౨౮

తే॥గీ॥ అంచుఁ బ్రార్థించి కన్నీరు ◆ నించి యవలి
కేగి, గగనపర్యంకమ్ము ◆ నెక్కి యపుడె
దిగ్లతాంగులఁ దెలినవ్వు◆తేట ముంచు
కృష్ణపక్షాష్టమీచంద్రు ◆ నీక్షఁజేసి. ౨౯

తే॥గీ॥ అదిగొ నరురాత్రికృత్యమ్ము ◆ లరయఁ గాల
పురుషుఁ డుపయోగమును జేయఁ◆బూను దూర
దర్శనపుయంత్రి మనఁ బ్రమ◆త్తస్వభావ
యామినీకామినీనాథుఁ ◆ డవతరించె. 30

తే॥గీ॥ చూచెదము నిన్ను శీతల◆రోచి వంచు
మ్రొక్కెదము నీకు శివమౌళి◆భూష వంచుఁ
దిట్టెదము నిన్ను మన్మథో◆ద్దీప్తుఁ డంచు
సర్వసాక్షిస్వరూప! వి◆శ్వప్రదీప! 3౧

తే॥గీ॥ అనుచు నే మేమొ, పద్యమ్ము ◆ లల్లియల్లి
తలుపుల బిగించి శయ్యపైఁ ◆ దనువుఁ జేర్చి
యంబ హృదయానఁ దాండవ ◆ మాడుచుండఁ
గాఁ గనుంగవ మూసె న◆క్కవివరుండు. 3౨

వ॥ అటఁ గమలయు.

తే॥గీ॥ తనయభీష్టమ్ము నెఱవేర్చు♦కొను విధమ్ము
లెల్ల నెంచి వాటికి సంభ♦విల్లు నంత
రాయముల కుల్కి, తుదకు ను♦పాయ మొకటి
స్థిరపఱచి దానిని బొనర్చు ♦ తెగువతోడ. ౩౩

మ॥ తన కన్విందగు వానిచిత్రమును డెం♦దమ్మందు హత్తించి యా
తని సంజారము లెంచుచున్ ధవుఁడు ని♦ద్రన్ జెందు నెప్డన్నయో
జనతోడన్ బేడమోముతోడఁ బతిప♦జ్జన్ మేను కుంచించి పం
డెను మారాస్త్రవితానకీలికల కెం♦తేఁ దానకమ్మై మదిన్. ౩౪

తే॥గీ॥ క్షణ మొకయుగమ్ముగా నిట్లు ♦ గడపుచుఁ ద్వర
పడినఁ దనపూన్కి తీరదన్ ♦ మడుకుతోన
వేచియున్నంత నంతలో ♦ వీనుపండు
వయ్యె వృద్ధుని గంభీర ♦ మైన గుఱక. ౩౫

వ॥ అట్లు విని.

సీ॥ గాఢనిద్రముదరఁ ♦ గైకొని కాల్ సేతు
లట్టిటు బొరలించు ♦ నట్టుగాఁగ
లలితహేమంతకా♦లమున మిథునముల
బిగికౌఁగిలింతల♦విధము గాఁగఁ
కలలోన భీషణా♦గాధగాథల మున్గి
కలవరింపఁగడంగు♦కరణి గాఁగఁ
బ్రణయకోపావేశ♦భరితు నాథుని దేర్పఁ
జక్కిలిగిలిపెట్టు♦చాడ్పు గాఁగ

తే॥గీ॥ మోవి మోవి తేనియ లాను♦మురువు గాఁగ
వృద్ధధవుగాఢనిద్రప♦రీక్షఁ జేసి
శవమునాఁ బడియుండిన♦జరఠు విడచి
ప్రక్క కొత్తిలి లేచె నా♦టక్కులాడి. ౩౬

వ॥ అట్లు లేచి యల్లనల్లన నడిచి మూఁడవయంతరువుం జేరుద్వారము కడ కేగి తా నంతకుము న్నందు గుప్పపరచిన బీగముం గైకొని తలుపులఁ దీసి లోని కరిగి కళానిధిగదిలో నలుకు డేమైన వినవచ్చునేమో యని చెవుల నిక్కించి విని, యలుకుడు వినరామికి నొకింత యోజించి లోన వలదు వలదని దడదడను లీల బోధించు పరమాత్మను లక్షింపక కళానిధియాగారమున కేగు తలుపుల గడెఁ దీసి యవల గొళ్లెము బిగించుటఁ దెలిసి గాజులఁ గదల్చుచు టిక్కుటిక్కుమను ధ్వని విడువక చేయుచున్నంతలోన నతండు. ౩౭

ఉ॥ నెమ్మది యప్పుడే మసక ♦ నిద్దుర గైకొనినాఁడు గాన, నే
త్రమ్ముల విచ్చి యాధ్వనివి♦ధమ్ము గ్రహించి కలంగుపాటు ధై
ర్యమ్మును పెనంగొనంగ బడక ♦ నల్లన వీడి కవాటపార్శ్వభా
గమ్మున నిల్చి యెవ్వరన ♦ గాజులసవ్వడు లుత్తరం బిడన్. ౩౮

తే॥గీ॥ తలుపు దీయక యున్న ని♦ద్రను వహించె
నితఁ డని యీమె యెల్లియు ♦ నేగుదెంచు
నిపుడె బోధించి మరలించు ♦ టెంతయేని
మంచి దని తల్పు దీసి యా♦మాన్యమూర్తి. ౩౯

సీ॥ నవయౌవనోన్మదా♦నంగసంగరకళా
వ్యసనసూచితకుచ♦ద్వయము దానిఁ
బులకితస్నిగ్ధక♦పోలసీమావృత
శ్రవణభూషణచక♦చ్చకలదాని
లలితకాషాయాంబ♦రచ్ఛన్నదీప్తాంగ
భరితసౌందర్యవై♦భవము దానిఁ
గర్పూరవీటీసు♦గంధబంధురతైల
కుసుమవాసితఘుమం♦ఘుమలదాని

తే॥గీ॥ లలితలజ్జావిలాసని♦సులమనోజ్ఞ
తామలానురాగరసమ♦హత్త్వకలిత
చలితవినయానమితకటా♦క్షములదాని
నరసినంతన నిశ్చేష్టుఁ♦డై యతండు. ౪౦

శా॥ ఔరౌ, ధారుణిలోన సుందరకళా ♦ వృత్తిన్ బ్రశంసార్హలౌ
నారుల్ వారల కింత సాహసమరం ♦ తక్రూరకృత్యాళినే
పారన్ బోవవుగాక భావములు, వే ♦ రైనన్ బ్రపంచంబు నం
దేరీ వీరు పతివ్రతామణులటం ♦ చింతేని వాక్రువ్వఁగన్. ౪౧

తే॥ గీ॥ ఉండెఁగాక దుర్గాంబ యీ ♦ యుత్పలాక్షి
యంతరంగమ్మునందు న ♦ నంత తేజ
మొలుకఁ జైతన్యరూపయై ♦ నిలిచె నెదుటఁ
గావునఁ బరాంబ యని యీమెఁ ♦ గాంచు టొప్పు. ౪౨

క॥ అని మనమున ధృతి నిల్పి గ
ళనినదమున గద్గదికము ♦ లవమేనియుఁ దోఁ
పనిభంగిని యంజలి నిడి
యను వినయాదరము లెసఁగ ♦ నాపెకు బ్రీతిన్. ౪౩

శా॥ అమ్మా! యేమిటి కిట్లు వచ్చితిరి, కా ♦ ర్యం బేమియో? యర్ధరా
త్రి మ్మారీతిగ నేగుదేరఁగఁ బ్రమా ♦ దమ్మౌ, నొరుల్ విన్న నిం
ద్యమ్మౌల్ పల్కుదు, రేమిచెప్పుదు, నగ ♦ త్యంబైన నే రానె? యో
గ్యమ్మా మీర లెఱుంగరా యనుచు వాఁ ♦ డాడంగ నాలేమయున్ ౪౪

మ॥ తన యాకూత మెఱింగి సైగలగమిన్ ♦ దన్నొవ్వఁగాఁ జేసి గు
ట్టును మట్టున్ దెలియంగఁజాలి తమి ని ♦ ట్టుల్ రాగ వేదాంతి పో
ల్కి నుపన్యాసము లిచ్చు నాతని యెదన్ ♦ గ్రిగంటివాలమ్ము తే
సి నిజాభీష్టముఁ దెల్పఁ జాలకయ తా ♦ సిగ్గల్లె నుల్లమ్మునన్. ౪౫

వ॥ అంత.

తే॥ గీ॥ ప్రొద్దుపోయిన దేగి ధ ♦ వుచరణాబ్జ
సేవ యొనరించి నిద్రింపు ♦ డేవిధమ్ము
నను కవాటమ్ము లున్న వ ♦ ట్లనె బిగింపుఁ
డంచు నాతండు వలుక నా ♦ చంచలాక్షి. ౪౬

ఉ॥ కార్యము తప్పివచ్చినది♦గాఁ దలపోసి మనోభవార్తతా
నార్యదురంతకృత్యమున♦కై యిటుసాలితి విప్పిచెప్ప నా
దార్యుఁ డితండు నన్ రతికిఁ♦దార్చునొ, త్రోయునొ; యట్లుగాక, దు
ష్కార్య మటంచు నెల్లరికిఁ ♦ జాటునొ; యంచు విషాదమగ్నయై. ౪౭

వ॥ ఎట్టకేలకు ధైర్యము వహించి.

క॥ కొనగోట నేలవ్రాయుచు
స్వనమున మెల్లఁదన మొప్పఁ ♦ బయ్యెఁట నలన
ల్లన దిద్దుచుఁ దలవాంచి య
తని కిట్టు లనియె వినమ్ర♦తాభావమునన్. ౪౮

తే॥గీ॥ సరసకవితావిలాససం♦స్కారమతులు
పరహృదయగూఢభేదనా♦స్పదకటాక్షు
కలితులగు మీకు నేమని ♦ పలుకఁగలదు
నన్నుఁబోలు వృద్ధాంగన ♦ నయవిచార! ౪౯

క॥ ప్రాయము యౌవనమును జన
గేయోజ్జ్వలభోగభాగ్య♦కలిత లగు నీ
యీ యువతులకు నిశీథుల
నే యభిమత ముండు నెఱుఁగ♦వే? కవిరాజా! ౫౦

వ॥ అని వక్కాణించి మిన్నకుండిన నతండు స్త్రీ సాహసమ్ము గ్రహించి, యామె మనమ్ము నొవ్వనాడిన మీఁ దేమికీడు మూడునో యని శంకించి. దైవంబుపై భారమ్మునించి, ధైర్యము వహించి, యామెం గాంచి.

మ॥ జననీ! నీదు మనోగతాభిమతముల్ ♦ సర్వమ్ము గుర్తించినాఁ
డను నీబోంట్లకుఁ దోఁచరాని దిది, కష్టా! తోఁచె నెట్టుల్, మన
మ్మున యోజింపును దీన నేమి సుఖమో, ♦ పుణ్యమ్మొ, కామవ్యథా
జనితాజ్ఞానవు నై, వచించి తెదియో ♦ చాలింపుమీ వాక్యముల్. ౫౧

మ॥ తలఁపన్ రానిది, చేయరానిది, యథా♦ర్థం బీ యనాలోచనా
కలితాకార్యపరంపరానుగత లై ♦ కాంతల్ దురంతాపవా

దలఁ గాయమ్ముల వీడి, తుట్టతుద ను♦ద్యన్నారకాగ్నిచ్ఛటా
వలిలోఁ గూలుదు రంచు నీ వెఱుఁగవే ♦ పల్కంగ నే నెవ్వఁడన్. ౫౩

క॥ వృద్ధాంగన నంటివి యిల
వృద్ధాంగన లెల్ల రిట్ట♦రే; ధవపాదో
ద్యద్ధూళి జీవనముగ స
మృద్ధయశమ్మును గడించు ♦ లెఱుఁగవె వారల్ ? ౫౪

వ॥ అని నిశ్చలముగాఁ జూచు నతని మాటలకుఁ గటకటం బడి యాబోఁటి, యగును మీ రనినది యథార్థంబ కావచ్చు నదికా దిది యను వాదంబు నా కేల? యపవాదభయమ్మున కిట మీరును నేనును దక్క మఱెవ్వరు లేరుగదా? అదియుంగాక మీర లుదయమ్మున ననుగ్రహించిన కను సైగల పథమ్మున నా కానందమ్ముఁ గూర్పఁ డాకలిఁ గొన్నవాని కన్న మిదుము మని పిల్చి యాసపై వచ్చిన నతనిఁ బొమ్మనుటఁ బాడియే, యన నతండు.

క॥ మన మిర్వురమే నని నె
మ్మనమునఁ దలపోయ నేల ♦ మానసపద్మ
మ్మునఁ దాండవ మాడెడు ని
త్యుని సర్వవ్యాపి నెఱుఁగు ♦ మో జనయిత్రి! ౫౫

క॥ మన మతిచంచల మగుట ధృ
తి నాకింతేఁ బూనలేని♦స్థితి నందుటఁ బ్రో
ద్దునఁ గను గీటిన నను గృపఁ
గమఁగొని సుతు నటు క్షమింపఁ♦గా వలెఁ దల్లీ! ౫౬

ఉ॥ ఆకలిఁ గొన్నవానికిఁ బ్రి♦యాన్నముఁ బెట్టుదు మంచుఁ బిల్చి యా
పైకల దంచు లేదనుచుఁ ♦ బల్కుట భావ్యము కాదు కాని దో
షాకరమైన యన్న మిడి ♦ యాతఁడుఁ దాను దురంతరౌరవా
ప్తోకతరాగ్నితప్తు లగు♦చో నిడఁ బాడియె చెప్పు మమ్మరో! ౫౭

వ॥ కాన నను క్షమించి తా మేగుఁ డనునాతనిమాటల కేమియా యామె ప్రత్యుత్తరం బీయఁదలంచు నంత.

క|| ఆతఁడె సుఖసుప్తుం డగు
నా తరుణీమణిధవుం డు ♦ దంచితజాడ్యో
పేతుఁడు హో ఖుర్రు హో ఖ్ఖుర
హాః తృఖ్ఖురు ఖుర్ ఖు ఘుంఖు ♦ రంచని దగ్గెన్. ౫౯

ఉ|| ఆ వికటారవమ్ము విని ♦ నంతన లోన దిగుల్ జనింపఁ గ
ళ్ళావి చలింపఁ గ్రొంజెమట ♦ మోమును నింపఁగఁ దొట్రుపాటుతో
నావలి కేగుచో నతని ♦ హాసము ముద్దిడె, మేనివాసనల్
ప్రోవులుపెట్ట లేనగవు ♦ పొందొనరింప విచారమగ్నయై.

వ|| ఇటు లామె ముద్దుంగొని మెఱుపు మెఱసిన చందాన టక్కు
మని తలుపు బిగించి పోయినంత.

ఉ|| జారునిమాడ్కి వంచకుని ♦ చాడ్పునఁ జోరువిధమ్మునన్ మరా
చారుని రీతి హంతకుని ♦ చందమునన్ మృషవాదికైవడిన్
దారుణపాతకాచరణు ♦ దారినిఁ జేష్టలఁ దక్కి యాపయిన్
ద్వారముఁ జేరవేసి తన ♦ పాన్పుపయిన్ మెయిఁ జేర్చి యూర్పుతోన్.

మ|| అకటా! యెంతటి జంత! యెంతపనిఁజే ♦ యన్ జాలె! నెన్నెన్ని పా
ట్లకు లోనయ్యె మహోఘ మియ్యదనుమా ♦ టల్ కూడ వింతయ్యె నా
పెను, నీ యౌవనదుర్మదాంధ యిఁక నే ♦ పెంటన్ బరిజ్ఞాన యౌ
నో కదా, గాఢవిమోహబంధనములన్ ♦ ద్రుక్కొండి త్రొక్కొడకన్.

క|| తలపూవయి కొలమంచున
వెలుఁగంగల భాగ్యరాశి ♦ వృద్ధుని సతియౌ
టల సద్ధర్మము విడి యిటు
కులటాచారమ్ము నూను ♦ కోర్కెఁ జెలంగెన్. ౬౩

చం|| అతఁ డసమర్థుఁ డౌట హృద ♦ య మ్మతిచంచలమౌటఁ బ్రాయమౌ
తతనవయౌవనోజ్జ్వల క ♦ థానక మౌటఁ దదీయచేష్ట కూ
ర్జితమగు నాస నే గలుగఁ ♦ జేయుటఁ దా నయి యింతసాహస
స్థితి కొడిఁగట్టె నీమె యని ♦ చెప్పక చెప్పెడు నామెపల్కులే. ౬౪

తే|| గీ|| అంగనల కాఱురెట్లు సా ♦ హస మటన్న
పలుకునకు సాక్షి కాఁగఁ జుం ♦ బనముతోడ

నన్ను వదలెఁ బ్రబంధాఘ♦నాయికలటు
కౌఁగిలించి పరీక్షింప♦కయ లతాంగి. ౬౫

తే॥ గీ॥ పరిచయము లేని కనుసైగ ♦ దొరలుతోన
నిక్క మగు ప్రేమ జనియించు♦నే విమోహ
కలితతాత్కాలికోద్రేక♦లలితచుంబ
నాచరణ కొగ్గఁగాక ని♦య్యాలరుఁబోఁడి. ౬౬

క॥ జననీజనకులదురిత
మ్మున నాకును సాము పాప♦మును బంచునొ ధ
ర్మనిధానుం డకటా! ప్రా
ద్ధున నాచేసినయఘమ్ము ♦ తోసెడి దగునే? ౬౭

తే॥ గీ॥ ఫలమెఱుంగని కనుసైగ ♦ వాలుఁజూపు
నీటుగోటుల బాటల ♦ నెయ్యమాడఁ
బుణ్యపాపానసంతతుల్ ♦ పాడ వడంగ
నరకపథకవాటమ్ములు ♦ తెరచుకొనియె. ౬౮

తే॥ గీ॥ ఆపథమ్మునఁ జనలేక ♦ నవలఁ బొమ్మ
టంచుఁ ద్రోసితి భువనమో♦హనవిలాస
కలితకళ్యాణమూర్తిని ♦ గాని తుదకుఁ
దప్పునట్టులు దోఁచెఁ ద♦త్పథమహాగ్ని. ౬౯

తే॥ గీ॥ సతము వైరాగ్యచింతనా♦స్పదకథావి
ధానములలోనఁ దిరుగు మ♦న్మానసమ్ము
సైత మేమొ విభ్రాంతికిఁ♦జాలె నకట!
యేమి చేయుదు నాధైర్య ♦ మెట్లు నిలుచు? ౭౦

తే॥ గీ॥ అంచు యోజించునంతలో ♦ నలఁత వొడమెఁ
గనులు మోడ్పులువడె మనం♦బునఁ జెలంగు
వలపుఁ దలఁపులగములెల్లఁ ♦ గలలు నయ్యె
నెమ్మదిగ వాని నిద్రపె♦ద్దమ్మ పట్టె. ౭౧

ఓమ్.

శ్రీమ త్పరాంబికాయై నమః.



# శ్రీ

# రసాశ్రయము.

## 3 వ దళము.



చ॥ అతఁడు విరాగి కాఁడు మధు♦రాధరలే సుఖమూర్తు లంచు స
మ్మతిఁ దలపోయువాఁడు క్షణ♦మాత్రము కల్గిన తద్విరాగసం
స్థితి కెద నొగ్గి తా వలచి ♦ చేరిన చెల్వను ద్రోసెఁగాక, లో
ధృతి విడి స్వప్నరంగమున ♦ నేడ్చుట నెవ్వఁడు చూడఁగల్గెడున్.

చ॥ చదువునుగాక తా నుపని♦షత్సుధఁ గ్రోలునుగాక జన్నముల్
పది పొనరించుఁగాక ఋజు♦పద్ధతి వర్తిలుఁ గాక శాస్త్రపున్
మదిఁ గనుఁగాక పేరుగల♦తోయములందు మునుంగుఁగాక స
ద్బుధుఁ డగుఁగాక కామినుల♦మోహకటాక్ష నిబద్ధుఁడౌఁ గదా.

మ॥ పులకల్ పుట్టఁగ బిగ్గకౌఁగిళుల నా♦మోదమ్ములన్ మున్గి న
ట్టులు నోష్ఠామృతధారలన్ దనిసిన♦ట్టుల్ ఇర్వురున్ గూడి విం

తలు కావించినయట్లు బోన్నతకళా♦స్థానంబులన్ గీటి న
వ్వులలోఁ దేల్చి హసించిన ట్లభినయ♦మ్ముల్ సేయువాఁడుం గలన్. ౩

తే॥గీ॥ అట్టు లాతండు స్వప్నసు♦ఖైకపరతఁ
గాలమున్ బుచ్చుచున్నంతఁ ♦ గాలమూర్తి
యనఁదగిన కోడికూసె మ♦హార్థభరిత
ప్రణవనాదంబురీతి వి♦ద్వాంసు లెంచ. ౪

తే॥ గీ॥ ప్రణయసామ్రాజ్యసౌఖ్యసం♦భావితులకుఁ
జోరమార్గైకజీవనా♦ధారులకును
గాయకష్టప్రశస్తని♦ష్ఠాయితులకు
నపుడు మేల్కొల్పుఁ బాడెఁ బ♦దాయుధమ్ము. ౫

తే॥గీ॥ జిలిబిలి మెఱుంగుచెక్కుల♦చెలువుదాని
నిబ్బరఁపుటుబ్బుగుబ్బల♦నిక్కుదాని
వలపు నిడువాలుఁజూపుల♦తళుకుదాని
గాలి సోకినమాత్రనఁ ♦ గరఁగఁ డెవ్వఁడు. ౬

మ॥ అనునర్థమ్ములు తన్ని నాదములఁ బ్ర♦ఖ్యాతమ్ములై పోయె నం
తనఁ బ్రాగంగన నోముపంట, నలినీ♦తన్వంగి జీవమ్ము, జీ
వనికాయమ్ముల వెల్గు, కర్మగతులన్ ♦ వాసించు దైవమ్ము, చే
తనమున్ గూర్చెడు ప్రొద్ద, తోఁచె గగనో♦ద్యానప్రదేశమ్మునన్. ౭

సీ॥ జిలిబిలి కెరటాలఁ ♦ జెలరేగి తుళ్లింత
లాడు తెమ్మెర కుఱ్ఱ♦వాఁడు విసరఁ
బూలపానీయమ్ముఁ ♦ గ్రోలి నొండొఁటి దాఁటు
తేఁటులు విజయగీ♦తికలఁ బాడ
ఱెప్పార్పు కెప్పు డా♦శ్రితుపోల్కిఁ బొద్దుతి
రుగుడు కట్టెదుట మె♦ఱుంగుఁ జూప
నిసుఁగుల బుజ్జగిం♦చి నభమ్ములన్ బాఱు
పక్షిసంతతి భరా♦బరులొనర్పఁ

తే॥గీ॥ ప్రేమ మీర నుషస్సతి ♦ లేతపచ్చి
కలను దళుకారు మంచుపూ♦వులసరమ్ము
గళమునందునఁ గైసేయఁ♦గా నినుండు
నుదయగిరి సింహపీఠిపైఁ ♦ బదము పెట్టె. ౮

క॥ అంతఁ గళానిధి మేల్కాని
సంతాపము గదుర చిత్త♦శాంతికి యత్నం
బెంతేఁ జేసియు హృది నా
కాంతాకృతి తాండవింపఁ♦గాఁ జలితుండై. ౯

వ॥ ఎటులో కాలకృత్యము లొనర్చుకొనుచు నాజవ్వనిం దలంచి.

చ॥ అరరె, యఘు మ్మఘు మ్మనుచు ♦ నందఁగరానిఫలమ్ము చేతికిన్
దొరక నదృష్టవానుఁడను ♦ ద్రోసితిఁ జెప్పఁగరాని వేదనా
భరము భరింపలేక వసి♦వాళ్లువడెన్ హృదయాంబుజం బిఁకే
కరణి లభించు దానిబిగ♦కౌఁగిట లోఁగొనుభాగ్య మక్కటా! ౧౦

మ॥ అరయంగా విరిఁబోఁడిచుంబనపుఁ జా♦యల్ నాదుముంజేయి యం
దొరగెన్ మేనొక వింతహాయిఁగని యెం♦దో భావసౌధాంతర
స్ఫురితానందరసాంబుధిన్ మునుఁగుచా♦డ్పున్ బొంది, నాయాసుధా
ధరకాయమ్ములు రెండు నొక్కటగు మో♦దం బెట్లు రాణించునో? ౧౧

సీ॥ అలఁత తీరఁగ దాని♦యరుణాధరామృతా
నూనపానము సేయ♦నోఁచ నేని
వలఁపు మీరఁగ దాని♦లలితోష్ణకుచకుంభ
యుగళీపరిష్వంగ ♦ మొంద నేనిఁ
బ్రమద మూరఁగ దాని♦పారావతారావ
కలనచే ధన్యతఁ ♦ గాంచ నేని
మనసు బాఱఁగ దాని♦మహితవేణీతాడ
నానందభాగ్యమ్ము ♦ నంద నేని

తే॥ గీ॥ దాని జాత్యనుగుణబంధ♦నానవీన
లలితచాతుర్యమదనసా♦మ్రాజ్యసింహ

కీర్తి నెక్కించుమార్గమ్ము ♦ వెదుక నేని
యకట! నాజన్మ వ్యర్థమె ♦ కా ధరిత్రి. ౧౨

శా॥ నే నెందేగినఁ బూలవాసనలె రా ♦ జించున్నదే గాంచినన్
నానారీతుల స్వప్నగాథలె మదిన్ ♦ దైవా రెటుల్ కన్న నా
లోనన్ దాండవ మాడుచున్నయది యా ♦ లోలాలకశ్రీనిధా
నానూనాననరోచి, యక్కటకటా! ♦ యాచింపఁ బోఁద్రోసితిన్. ౧౩

వ॥ అని మఱియు.

సీ॥ ఆ మోహినీమోహ ♦ నానంతశృంగార
వేషమ్మును దలంచి ♦ వింతనూను
నా కామినీప్రణ ♦ యానురాగాలోల
వాచారసం బెంచి ♦ వనట మునుఁగు
నా భామినీమనో ♦ హరసలజ్జావిలా
సాపాంగతతు లెంచి ♦ యటమటించు
నా తరుణీసర ♦ సాభివాంఛావ్యక్త
వదనాభినయ మెంచి ♦ భ్రాంతినొందు

తే॥గీ॥ నాలలన ప్రార్థనాచుంబ ♦ నాదికాల
లీలల స్మరించి తన్మయ ♦ శ్రీలఁ దేలు
నాసుదతిమూర్తి హృత్ఫల ♦ కాంతరమునఁ
గాంచుఁ గన్గవ మోడ్చి, యా ♦ కవివరుండు. ౧౪

తే॥ గీ॥ ఇంతలో నిట్టు లౌదునం ♦ చెఱిఁగియున్న
రాత్రి యామోహనాంగి ని ♦ రాకరింతు
నా? తదీయానుపమమధు ♦ రాధరామృ
తమ్ముఁ గ్రోలి సుఖైకప ♦ దమ్ముఁ గనక. ౧౫

క॥ అని పలురీతుల భావ
మ్మున నేమేమో తలంచి ♦ మోహపరత్వ

మ్మన మైమఱచిన యాతని
కనులకు దుర్గాలయమ్ము ♦ కానఁగవచ్చెన్. ౧౬

ఉ॥ కానఁగరాఁ బరాంబ సువి♦కస్వరమూర్తి మనమ్మునందు నెం
తేనియుఁ దట్టి, నెక్కొని య♦నేకవిధమ్ములఁ దాండవింప, న
ద్దానఁ బ్రియాంగనాకృతియుఁ ♦ దారసిలంగఁ దదంగనాకృతి
శ్రీ నెసఁగన్ బరాంబ తన♦చిత్తమునందు, ధృతిన్ దొలంగుచున్.

తే॥ గీ॥ తలఁపుల నొకంటఁ గలికి క్రొం♦దళుకు మెఱుఁగు
నా మెఱుంగుల దుర్గ ♦ నాట్య మొనర్చు
దురనాట్యమ్ములో లేమ ♦ తోఁచుచుండ
భీతుఁడై వాఁడు బడి కేగ ♦ వేళతటియ. ౧౭

వ॥ అవిధిఁ గళానిధిచేఁ దిరస్కృతయైపోయిన కమలయుఁ దన మనమ్మున.

ఉ॥ అతఁడు చంచలుం డుదయ♦మందునఁ గనవగీటి నన్ను సం
ప్రీతిగ నేల నెంచె. మఱి♦పెమ్మిగ నేనయి పోవఁ ద్రోసె, వి
ఖ్యాతకవీంద్రుఁడైన నగుఁ♦గాక, రసాంబుధిఁ దోఁగకున్న నే
రీతి యశమ్ము నందు, సరి♦లే, యిఁకఁ జూచెద వానిబీరమున్. ౧౯

క॥ ఆచుంబన మొక్కటియే
యాచంచలు నొంపఁజాలు ♦ నావల మత్కే
ళీచాతుర్యమ్మున నే
నై చేసెద శిక్షవాని ♦ కన్ని తెఱఁగులన్. ౨౯

ఆ॥ వె॥ గంపెడాసతోడఁ ♦ గౌఁగిలి నిమ్మన్నఁ
బొమ్మనుచు విరాగ♦పోల్కిఁ ద్రోసె
నతని కంటిసైగ ♦ లకట భావముఁ జీల్చె
నేల వలపుఁ జూపి ♦ చేలనైతి. ౨౧

చ॥ చెలువల కెప్డు వేగిరము ♦ చెల్లను; తా వలపించి ముందు లోఁ
గలఁగిన, వాఁడు బెద్దగులఁ♦గా మన మీయక వాని ముప్పతి

ప్పలు పడునట్లుఁజేసి, పిద♦పన్ గవగూడి సుఖింపవచ్చు నం
చిలపయిఁ గామశాస్త్రము వ♦చించెడు, నయ్యది రిత్తవోవునే. ౨౧

శా॥ కాని, కార్యము మించివచ్చినది నా♦కన్నిచ్చ నన్నింతగా
గ్లానిం బొందఁగఁజేసె, చేల నయిసన్ ♦ గాని మ్మిఁ కేరీతిగా
నేనిన్ వాని కవుంగిలిం బడయ నే♦నిన్ మోదువారున్ మదీ
యానూనాభిమతావసిజము వసం♦తారామమం దక్కటా! ౨౩

వ॥ మఱియు.

సీ॥ ఆసైగలకుఁ దోడు ♦ అతుల ధైర్యస్థైర్య
సాహసోరునిరంకు♦శత లమర్చి
ఆ సౌరునకుఁ దోడు ♦ అంగనాసదపాంగ
శృంఖలాబంధన ♦ శ్రీ ఘటించి
ఆ పల్కులకుఁ దోడు ♦ అనుపమకరుణాప్రి
సన్నవాసితమాన♦సమ్ముఁ గూర్చి
ఆ కైతలకుఁ దోడు♦అనుభవశృంగార
రసవాహినిపరి ♦ శ్రమ రచించి

తే॥ గీ॥ ఆ నతికిఁ దోడు ప్రణయకో♦పారుణేక్ష
ణాంబుజాత్య్రంఘ్రి నిర్మించి♦నపుడు కాదె
వేదజడుఁ డన్న యపవాద ♦ వీడు నీకు
నలినజా! వీని నిట్లేల ♦ సలిపినావు? ౨౪

తే॥ గీ॥ అతనితో నెట్టులేనియు ♦ ననఁగి పెనఁగి
యిక్షుకార్ముకసామ్రాజ్య ♦ మేలుటేని
లేక మన్మనోహరతర♦సత్కృతదవాగ్నిఁ
దనువుఁ ద్రోయుట యేనిఁ గృ♦త్యములు నాకు. ౨౫

చ॥ హృదయము వెల్వరింపఁ దగ ♦ దెవ్వరి కేనియు; వెల్వరించు పై
నొదవిన వాంఛతీరవలె; ♦ నొక్కపు డా క్రియఁగాక యున్న నా

పదకు దురంత-చింతకును ♦ బాల్పడి జీవములన్ భరించు క
న్నఁ దనువు వీడిపోవుట ఘ♦నమ్మని మానిను లెంతు రాత్మలన్. ౨౬

చ॥ అని పలుభంగులన్ హృదయ♦మందుఁ దలంచి వితాకు నొంది తోఁ
చనియటులన్ మెలంగి, పది♦సారులు వాని వచోవిమర్శనం
బును బొనరించి పెట్టివలెఁ ♦ బుష్పధనుర్ధరుదాడి కోడి క
మ్మను లిఖియింపనెంచి యను♦మానముఁ బూనెఁ దనంతఁ దానెదన్.

తే॥ గీ॥ సందియము నొంది మదివిమ♦ర్శనఁ బొనర్చి
సలుపఁదగినట్టి యత్నముల్ ♦ సలిపి యప్పు
డేనియు ఫలింపకున్న మ♦దీప్సితమ్ము
తనువుఁ దొఱఁగుట లెస్సని ♦ తలఁచి యామె. ౨౭

ఉ॥ కాకితమున్ గలమ్ముఁ గొని ♦ కన్గవ మూసి లిఖింతునెట్టు లా
ప్రాకటరూపవైభవక♦ళానిధి కంచు నెదం దలంచి యే
దో కలమెత్తి వ్రాయునెడఁ ♦ దోఁచెను వానిస్వరూప మంతలోఁ
జేకొనినట్లు ముద్దుఁగొను ♦ చెల్వునఁ గన్పడె భావనాకళల్. ౨౮

వ॥ భావనాకళాగతుల కాముగుద మైపులకరింప నొక్కింత కన్మో
గిచి యంతలోఁ దెలిసి గతవృత్తాంతమ్ముఁ దలంచి విషాదమ్మున నిట్లు
భావించె.

ఉ॥ అతఁడు నాదులేఖను ప్రి♦యమ్మునఁ గాంచునె? కాంచునేనియున్
జేతమునన్ దయాత్ముఁ డగు♦నే? యగునేని మదీయవాంఛలన్
బ్రీతిగఁ దీర్చునే? యటుల♦నే ఘటియిల్లిన నీ పిశాచి యీ
రీతి నెఱుంగ డే? యటు లె♦ఱింగిన సైఁచునె రవ్వసేయకన్? 30

ఉ॥ కట్టడికాక వాఁడు దమ♦కమ్మున నాప్రణయానురాగసం
ఘట్టన కొప్పి యేలుకొనఁ♦గాఁ దలపోసిన నీ పిచాచి నన్
బెట్టఁగలాడె బాధలు? వి♦వేకము వీడునె? యిట్టిచేతఁ దా
రట్టు నొనర్చుకో నెదఁ ద♦లంచునె? న న్నొకమాట యాడునే? 3౧

క॥ అని నిశ్చయమ్ముఁ జేసియు
మనప్రాప్తం బెట్లు కలదొ; స్మరదైవం బ
త్యనుకంపాత్ముఁ డని విం
టి నతం డేనిఁ గృపఁ బూనఁడే నామీఁదన్. ౩౨

వ॥ అని కమ్మ లిఖించి, యయ్యదెన్నిసారులో పఠించి, డెందమ్మున నాందోళన మంది చింతించి, ధైర్యం బవలంబించి, పైచిరునామా రచించి, సోపానశ్రేణి నధిష్ఠించి, సగము తెఱచియున్న వాతాయనమార్గమ్మున నద్దానిఁ గళానిధిగదిలోనికి విసరి, యథాస్థానమ్ము సేరె; నంత నతండును. ౩౩

ఉ॥ బోఁటియనన్ బ్రియమ్ము, జముపోటు లనన్ భయముల్ జనింపఁ బు
వ్వాటు మనమ్మునన్ దిగులువార నెదేనియు నిశ్చయింప కే
బాటయు లేక, బాలురకుఁ బాఠముఁ జెప్పుట కిచ్చగింప కా
పూటకు మాత్ర మెట్లొ సెలవున్ గొని క్రమ్మఱవచ్చె మేడకున్. ౩౪

ఉ॥ ఇట్టుల వచ్చి పానుపుపయిం బడి నిద్దుర రాక యోజనల్
తెట్టువఁగట్టఁ బొత్తములఁ దీసి, పఠింపఁగలేక, గుండియల్
కొట్టుకొనన్ రతీశ్వరనిగూఢశరాహతిఁ గందువారి యె
ట్టెట్టొ పచారులన్ సలుపనెంచి నిలంబడి నద్దెసల్ కనెన్. ౩౫

క॥ ఆతటి నాతని కగపడె
వాతాయనమందుఁ గవరు వాఁ డందులపై
వ్రాఁతం గని యాపెది యని
చేతమ్మునఁ బ్రియము భయము చింతలు తొరఁకన్. ౩౬

వ॥ మందుడు కడంచుకొని కవరు విడఁదీసి యిట్లు పఠింపందొడంగె.

క॥ హృదయేశ్వరా! వినందగు
మదీయహృదయాంబుజము సమర్పించితిఁ ద్వ
త్పదములకడ దీనిఁ బ్రియ
మ్మొదవన్ గ్రహియించి యేలుటొప్పదటోయీ! ౩౭

తే॥ గీ॥ వడఁదగులనీక, వసివాళ్లు ♦ వడఁగనీక
తావి విడనీక తేనియఁ ♦ దఱుఁగనీక
తళుకు లెడలంగ నీక యీ ♦ తరుణమంద
స్వీకరింపఁగదోయి, మ ♦ చ్చిత్తసుమము. ౩౮

ఉ॥ ఓర్చునఁటోయి, మారవిష ♦ మోగ్రశిలీముఖభీకరాగ్ని బా
ధోర్చునఁటోయి నీదువిము ♦ ఖోత్కటవాక్యపరంపరాగ్ని ధా
ఢోర్చునఁటోయి, యౌవనమ ♦ దోద్ధతజాతనిజేప్సితాగ్ని సో
ఢోర్చునఁటోయి, కమ్రసుమ ♦ మోయి కృపం గనుమోయి సత్కవీ. ౩౯

ఉ॥ రమ్మని చేరఁదీసి రుచి ♦ రమ్ముగ దాని గ్రహించి, నించి ప్రే
మమ్ము, తదీయనూతనస ♦ మగ్ర రసగ్రహణం బొనర్చి డెం
దమ్మున, జో టొకింత యయి ♦ నన్ దయచేయఁగదోయి, లోన మా
ధ్యమ్మును వీడుమోయి య,క ♦ టా! మృదుసూనము వాడు నో కవీ! ౪౦

ఉ॥ ఎంచఁగదోయి నావయసుఁ ♦ నెంచగదోయి, మదీయకర్మయా
లించఁగదోయి నాదుమొఱ ♦ ప్రేమపరీమళవాక్సుధాప్రపూ
ర్ణాంచితవీచికాచయవి ♦ హార కృతార్థ నొనర్పుమోయి, యా
చించుచు నుంటినోయి నను ♦ నీ యనకోయి కవీంద్రచంద్రమా! ౪౧

చ॥ తలఁప రసాధ్యుఁ డంట, కవి ♦ తావనితాచతురక్రియాకళా
కలితుఁ డటంట, యౌవనవి ♦ కాసవిలాసమనోహరాంగి యౌ
కలికి యటంట, తా నగుచుఁ ♦ గమ్రహృదబ్జ మొసంగ మూఢుఁడై
వలద నె నంట, దీనిఁ బెఱ ♦ వారలు విన్న హసింపరా కవీ! ౪౨

చ॥ మఱియొకమాటఁ జెప్పెద సు ♦ మా! యనుమానము మానుమా నిరం
తరమదనానలప్రకట ♦ దారుణబాధను నోర్చుఁగాక వి
స్ఫురితభవ త్తిరస్కృతవ ♦ చోనిచయాగ్నుల నోర్వలేక తా
నురిగి నశించిపోవు మృదు ♦ సూనముపై ననుకంప నూనుమా. ౪౩

తే॥గీ॥ తరఁగలై తుళ్లి మకరంద ♦ ధారలోనఁ
దెమ్మెర నిసుంగు రాయబా ♦ రమ్ము నంపు

కుసుమకోమలి నపుడె పైకొని సుఖింపఁ
డే; మధుకరుండు నదిపాపమే? కవీంద్ర. ౪౪

తే॥గీ॥ పాప మని యంటివేని నాపలుకు వినుము
కడుపుకక్కుర్తికై ననుం గన్నవార
లీ వివాహ మ్మొనర్చిరి; భావకుసుమ
మేన నీ కిచ్చుచుంటి గ్రహింపఁ దగదె. ౪౫

తే॥గీ॥ ఈవ యొండనె దేని నా జీవములను
బలి నిడెద నీతిరస్కృతవాక్యతతికి
నాథ! యాపైనఁ గలసికొందము మహోగ్ర
రౌరవాసిపత్రాదినారకములందు. ౪౬

తే॥గీ॥ కడపలుకు విను నా కొడంబడెద వేనిఁ
జీటి నొక్కటి మాగోడచెంత విడుము
లేద యేని మత్ప్రాణముల్ తీసికొనఁగ
నాయితము కమ్ము, పలుమాట లాడఁ గమల. ౪౭

మ॥ అని యాలేఖఁ బఠించి తోడన మహోద్యత్ప్రేమవారాన్నిధిన్
మునుకల్ వైచి తదంగనాపరిచయానూనప్రియాలాపచుం
బనలన్ సంస్మరణం బొనర్చి నిజకామ్యావాప్తముల్ తీర్చుకొం
దు నటంచున్ దలపోయ నాతఁ డెదలోఁ దోఁచెన్ బరాంబాకళల్

ఉ॥ తోఁచిన యంబికాకళలతో మనమున్ లయమున్ బొనర్చి, సం
కోచముతోడఁ గమ్మ నెదకున్ బెరిమమ్మున హత్తుకొంచు, భ
క్త్యోచితచిత్తవృత్తి ప్రణయామృత మానుమనంబు, రెండునున్
వేచఁగ నెద్దియో యొకటి నిర్ణయమున్ బొనరించుపూన్కితోన్.

వ॥ ఇట్లు వితర్కింపఁ దొడంగె.

తే॥ గీ॥ ఒకటి ప్రాపంచికప్రణయోరుసుఖసు
ధాంబుధితరంగమాలికలందు నూఁపు.

మఱియొకటి, ముక్తివనితాస♦మాగమాంచి
తాద్భుతానంతసౌఖ్యము ♦ నందఁజేయు. ౫౦

చ॥ ఎది పొనరించువాఁడ నెద ♦నీ క్షణ సౌఖ్య విమోహవార్ధి బు
ద్బుదమటులన్ నశించెదనొ ? ♦ బుద్ధికిఁ గనవకేనతీత మై
తుద ననుభూతమౌ పదము♦తో; హృదయేచ్ఛలఁ గూర్తునో, ప్రియం
బెది యనువాఁడనో; యెది ఘ♦టించెద నో? యెదికర్జమో? విధీ! ౫౧

తే॥ గీ॥ పూవుటంపరకే, యొగ్గఁ♦బోనిమేను
యమభటక్రూరపాశదం♦డాయుధాది
బాధలకు నోర్చుటనఁ గల్ల ♦ వ్యభిచరించు
పాపమతి ఘోర మని గ్రంథ♦పాళి నుడువు. ౫౨

ఉ॥ ఆరుచిరాస్యమూర్తి హృద♦యమ్మున దాండవమాడునప్డె దు
ర్వారమణీయరూప మెద ♦ రాజిలుఁ గారణ మేమొ; యంతలో
భీరుతనమ్ము చేకురు, వి♦వేకము ముంగలనె నశించు, వి
స్తారవిచారకీలికల♦తానక మై కలఁగున్ మన మ్మొగిన్. ౫౩

శా॥ నా యీ బాధ లనంతముల్ మది నెఱుం♦గన్ జాలు దీవున్ వినో
దాయత్తంబగు నీకు సర్వముఁ బ్రపం♦చాతీతుఁ డాభావజుం
డా యోధాగ్రసరున్ జయించుటకు నే♦నా చాలువాఁడన్? బరాం
బా! యెంతేని యనుగ్రహింపవలదా ♦ బాలున్ భవద్దాసునిన్. ౫౪

ఉ॥ కాము జయింపఁగా వశము♦కాదని యీవ యెఱుంగు, దట్టి మా
యామయు చండవిక్రమమె కా ♦ భవదీయవినోదసృష్టి కా
ర్యామలమూలమై యెసఁగు ♦ నట్టియెడన్ జిరసంస్పృహస్థిర
ప్రేమమనస్కు లెక్కురణి ♦ వీటిడిఁ జేయుము రా యనంగునిన్. ౫౫

తే॥ గీ॥ మొద్దువారంగఁజేయు నా♦పూవు టెడఁదఁ
గడలు తీర్పంగసాగు మ♦త్కావ్యములకు

లీనమును జేసికొనుము నీ♦లోన నన్ను
వృజినమునఁ ద్రోయఁదల పూన ♦ వేని మాత! ౫౬

మ॥ చదియన్ గింకరు లుగ్రరౌరవశిఖి♦జ్వాలాముఖంబందుఁ ద్రో
యుదు రంచే భయమొందుచుంటిని, స్మరో♦ద్యోగంబు నీక్షింప ని
య్యదనందే శతరౌరవోపమసుమా♦స్త్రాగ్నిచ్ఛటన్ గాల్పఁగా
మది నూహించినచాడ్పునన్ దనరు నం♦బా! యేమి కావించెదో. ౫౭

ఉ॥ చచ్చినపైన రాఁగలపర♦శస్తసుఖమ్ము ను విశ్వసించి, మై
నొచ్చినఁ, బ్రాణ మూడిన, మ♦నోధృఢశక్తి విమోహవార్నిధిన్
గ్రచ్చుఱ నుత్తరించెదనొ ♦ కాక తదీయసుఖైకవీచికా
త్యచ్చయమాల నాతరుణి♦తోఁ గను మాయయునో యహర్నిశల్. ౫౮

ఉ॥ ఏమి ఘటింతువో యెఱుఁగ, ♦ నేవిధి వ్రాసితివో యెఱుంగ నీ
వీ మెయి నన్ బరీక్ష నల♦యించెద వంచుఁ దలంపఁబోవ, ని
చ్ఛామతి నీ పరీకారమున ♦ నల్పు మటంచు ననుజనీయ రా
దా? మహితార్ద్రభావవు క♦దా జగదంబ! శిశ్రితాళిఁ దన్పుచోన్.

శా॥ ఏదో వింతవికార మొక్కటిటు లే♦మీ చూచె దాయింతి కే
రాదా కౌఁగిలి నంచు వాకొనెడుఁ దో♦రంబైన భీతిన్ మనం
బే దారిన్ జన దేమి సేయుదు విధా♦త్రీ! పుష్పశస్త్రాఘఁపున్
బాధాగ్నుల్ భరియింపరాని విఁక నే♦ఫక్కిన్ ధృతిం బూనెదన్. ౬౦

ఉ॥ మానససీమలోఁ గడుఁ బ్ర♦మాదపుటూహలు పుట్టుచుండె నె
న్నేనిఁ దదూహలన్ జెఱుప ♦ నెంతయు యత్న మొనర్చుచుంటిఁ గా
నీ ననుఁ జీరికిన్ గొనక ♦ నిక్కముగాఁ దమబాటఁ దిమ్మరం
గా నొనరించుపోకడలు ♦ కన్పడె నాగతి యెట్లు లున్నదో. ౬౧

ఉ॥ ఏడనొ మాఱుమూలల వ♦సించి, యెటో యొకటుల్ చరింపఁగాఁ
బాడుగ యత్నముల్ జరుపఁ♦ బాల్పడె నేటికి నిట్టిమేడ, పూఁ

బోఁడి ననుం గనుంగొని వి♦మోహము నొందఁగ నేల? నేనునుం
బాడయి తేమి టీగతి భ♦వద్విచితంబిదికా పరాంబికా! ౬౨

క॥ అని తిరిగి కమ్మఁ జదివి తు
దిని గల పద్యార్థ మరసి ♦ ధృతిఁ దొఱఁగి మన
మ్మున నే తోఁచిన నది మ
గ్గు నఁట నరకశిఖిని నన్నుఁ ♦ గూల్పఁగ నకటా. ౬౩

ఉ॥ నాకొఱకై నెలంత విడ♦నాడినచోఁ దనువాదుర్గంతము:
ఖాకులనారకాగ్నిశిఖ-♦ లార్పెద నెట్టటుఁగాక, నా లతాం
గీకుతుకమ్ముఁ దీర్చి పరి♦కించెద, నేక్రియఁ దప్ప దెలకూ
పాకరపాపమార్గ మక♦టా! యిపు డేమి పొనర్తు నంబికా! ౬౪

తే॥ గీ॥ అకట! ముకుపచ్చలారని♦యబలయంట!
స్వీయకౌమ్యమ్ము తీరమి ♦ జీవములను
దొఱఁగునట, యిట్టి స్త్రీహత్య ♦ కఱకు తురక
యైన నొడిఁగట్టునె! చలింప ♦ కాత్మయందు. ౬౫

ఉ॥ కొంచఁగ నెట్టులేని నర♦కమ్మొకదా యనుభూత మింక, యో
జించఁగ నేల నాకలికి♦చిత్తము నత్తమిలన్ బొనర్చుటే
మంచిది, యట్లు సేయు పయి♦మాన్యతఁ బాప్రచితముల్ పొనర్చుకొం
దం చతఁ డెంచుచున్ హృదయ♦మందునఁ దాలిమి తూలి యేడ్చుచున్

తే॥ గీ॥ మోము నానుడుదిండ్లపై ♦ మోపి, కరము
లుంచి శిరముపైఁ, బోయె న♦శించిపోయె
నాదు జ్ఞానసర్వస్వ మీ♦నాఁ డటంచు
నెత్తిపై మొత్తుకొనియె నా♦యుత్తమకవి. ౬౬

క॥ పడుచుంటి మోహజలధిన్
బడుచుంటి నుపేక్షనూన ♦ భావ్యం బని, యే
ర్పడెనా నీమది నంబా!
తడవేటికి నుద్ధరింపఁ ♦ దగదా నన్నున్ ౬౭

తే॥ గీ॥ అదె, ఘనాంధఘనాధ్వానంబు ♦ లఖిలదిశల
వ్యాప్తమైపోవఁ గింకరా♦వళి చెలంగ
భయదనారకద్వారక♦వాటయుగళి
పథ మొసంగెడు నాకె కా♦వలయు నేఁడు. ౧౯

తే॥ గీ॥ అసదృశపుఁ దావకీనాగ్ర♦హాగ్నికీల
మాడ్చెదో లేక హరికి బ్ర♦హ్మాదులకును
దాఁటరానిది నామాయ ♦ దాఁటు నెట్లు
వీఁ డని కనికరించెదో ♦ ప్రేమ నంబ! ౨౦

తే॥ గీ॥ కర్మబద్ధుండు జీవుండు♦కాన సర్వ
మును ద్వదిచ్ఛాగుణంబునఁ ♦ బొదలుఁగాన
కర్త్రివిని భోక్త్రివిని నీవ ♦ కాన నే ని
మిత్తమాత్రుండఁ గాన నీ♦చిత్త మంబ! ౨౧

క॥ దళితాఘము త్వన్మంత్రము
సలలితమోక్షైకసౌఖ్య♦సంభరితము, ని
శ్చలభక్తవ్రజకల్పక
మిల నన్నుఁ బునీతుఁ జేసి ♦ యేలెడుఁగాతన్ ౨౨

తే॥ గీ॥ అనుచు లేచి, కన్నీరమ్ము ♦ లద్ది యామె
యుత్తరమునందు నొకప్రక్క ♦ నుత్తరించి
మఱల వీక్షించి తప్పని♦సరణి గాఁగ
దీవ్రవేదనతోడ నీ♦తీరు వ్రాసె. ౨౩

తే॥ గీ॥ నను క్షమించి వేంచేయుము ♦ నాథునిద్ర
కెట్టి యభ్యంతరము లేని♦పట్టునందుఁ
దరుణి, యనివ్రాసి మడచి, వా♦తాయనంపుఁ
బథమునన్ గోడచెంత క♦వ్వాఁడు విసరె. ౨౪

తే॥ గీ॥ విసరి చేగడియారమ్ము ♦ వీక్షఁజేసి
భానుని ప్రయాణంపున్ సమా♦ప్తంబుఁ దెలిసి

పాఠశాలకు. నాకవి♦వర్యుఁ డేగె
భావికార్యవిచారసం♦భరితుఁ డగుచు. ౨౪

ఉ॥ అత్తలి రాకుఁ బోఁడియును ♦ నాతఁ డెటుల్ తన కిచ్చువాఁడొ ప్ర
త్యుత్తరమన్న యాతురత♦తో నటవేచిన చాటవేతఁ, దా
నత్తరి వానిచీటిఁ గొని ♦ యారసి మోదము నొంది, రాత్రి కా
యత్తమునా తెఱంగులకు♦నై మదినెంచె ననేకభంగులన్. ౨౫

వ॥ అంత.

తే॥గీ॥ ఇనుఁడు విశ్రాంతిఁ గైకొన ♦ నేగె నింక
స్వేచ్ఛఁ దిరిమ్మరుఁ డని స్వైర♦జీవవితతి
మధురసమయారవమ్ముల ♦ మందలించెఁ
బ్రేమపూర్ణవిహంగమ♦బృందమపుడు. ౨౬

తే॥గీ॥ తన్నినాదమ్ము వినుచు సం♦ధ్యావధూటి
యరుణవసనాంచలమ్ముల ♦ నందగించు
ప్రకృతికళ్యాణకళలు హ♦గమ్ముఁ బెంపఁ
గాఁ గపుల యత్నమగ్నయై ♦ క్రాలఁదొడఁగె. ౨౭

సీ॥ అరవిచ్చినట్టి క్రొ♦వ్విరులవాసన లెల్ల
కడల నెక్కొనఁ గీలు♦జడ ఘటించి
మైనిగారమ్ము లి♦మ్మడిచేయు నంగరా
గమున నల్పోష్ణోద♦కముల నాడి
యొడలి చొక్కఁపుటొప్పు♦లు బిగించి చెలువీ
యఁగల కెంజిగురువన్నె♦వలువఁ గట్టి
తళుకీనువలుదగు♦బ్బల నిబ్బరఁపుటుబ్బు
రవణింప జాలరు♦రైకఁ దొడిగి

తే॥ గీ॥ పునుఁగుఁ దావుల వెదజల్లు ♦ బొట్టు దిద్ది
గంధబంధురపుష్పాంబు♦కణము లల్ల

నల్లనన్ బైట నించి భూ◆షాదికములఁ
దాల్చి వీడ్యంపుఁజిల్కలఁ ◆ దమి రచించి. ౩౯

మ॥ పను లన్నింటి ముగించి, వృద్ధపదని◆ధ్యానమ్ము నాలించి, యా
యన కావశ్యకమౌ సపర్యలఁ బ్రి◆యంబందన్ ఘటింపించి భో
జనమాత్రోడ విడె మ్మొసంగి యతఁడున్ ◆ శయ్యాస్థలం బందుఁ జే
రినఁ దానున్ దిని వానిపజ్జ మెయి వా◆ల్చెన్ గాముకాందోళనన్. ౪౦

వ॥ కొంతసే పట్లుండి పిదపఁ గుసుమాయుధుకోల్తల కోపఁజాలక తన మనమ్మున.

తే॥ గీ॥ రే గతించెడు, ముసలి ని◆ద్రింపఁ, డతఁడు
నా కొఱకుఁ గాచి విసివి ◆ మనమ్మునందు
నొండుకైవడి నెంచి ప◆రుండు నేమొ
యే మొనర్చెదుదాన ని◆య్యెడల నేను. ౪౧

చ॥ ప్రతిదినమున్ మెయిన్ బడక ◆ వాల్చిన వెంటన గుఱ్ఱుపెట్టువాఁ
డితఁ డిపు డేల నీగతి వ◆హించెనొ జాగ్రదవస్థ? మానస
స్థితి కడు వేగురించెఁ ద్వరఁ ◆ జెందిన లాభము లేమి తాల్మి యం
చితశుభదాయకం బని వ◆చింపరె పెద్దలు గ్రంథపాళులన్. ౪౨

తే॥గీ॥ ఇట్లు యోజించుచున్నంత ◆ వృద్ధుగుఱ్ఱు
కోర్కెఁ దీర్పఁ బరీక్షలఁ ◆ గొన్ని సలిపి
పానుపున్ వీడి తా మును ◆ పదిలపరచి
నట్టి గంధాదులం గొని ◆ యరిగె నామె. ౪౩

వ॥ ఇట్లరిగి గతరాత్రికిం బలె కళానిధి గదితలుపుచెంగటికిం జని యయ్యది యోరువాకిలిగా నున్న సందియమున నిశ్శబ్దముగా లోని కొక్కింతరయేగి. ౪౪

ఉ॥ చీమ చిటుక్కుమన్న నత◆సీకుసుమోపమగాత్రి రాక యా
నేమొ యటంచు నల్దెసల ◆ నీక్షణచేయుచు ఘోరనారకో
ద్దామపథవ్యథల్ తలఁచి ◆ తల్లడమందుచు మధ్యమధ్య నే
దో మెల మెల్లఁగాఁ జమువు◆చుండెడునాతనిఁ గాంచి మెచ్చుచున్. ౪౫

వ॥ లోనికిం జన నతండు.

తే॥గీ॥ అవతరించిన సౌందర్య ♦ మనఁ దనర్చు
నాలతాంగి విలాసమ్ము ♦ వాలుఁగంటఁ
గాంచి మనమందుఁ దమకం బ♦డంచి మోవిఁ
జిఱునగవు చిందులాడ వి♦చ్చేయుమనుచు. ౨౬

వ॥ తన కట్టెదుట నున్న యాసనముఁ జూప నాపె యుపవిష్ట యయిన నతం డుత్సాహుండుఁగాక యిట్లనె.

తే॥గీ॥ పూర్వబంధంబొ? నాబుద్ధి♦పొరయొ? నేఁడు
కామినీ! నిన్ను నన్నును ♦ గలుపుచుండె
నేయదేనిఁ బ్రతిజ్ఞను ♦ జేయు మిప్పు
డనిన నొచ్చునె నిను నె♦మ్మనము నెపుమ. ౨౭

తే॥గీ॥ అనిన నొకపరి యాతని ♦ నరసి శిరము
వాంచి లజ్జాభినయముతోఁ ♦ బలికె నామె
యస్మదభివాంచిత మొసంగు ♦ నవల మీరు
చెప్పినటులెల్ల జేయు నే♦జీవి నిజము. ౨౮

వ॥ అనిన నత డొక్కింత చింతించి దీనాననుండై.

ఉ॥ ఘోరతరాఘ మియ్యది ని♦గూఢ మటం చెద నెంచఁబోకు; తా
నారయుచుండు నెప్డుఁ బర♦మాత్మ; యిఁకెప్పటికేనిఁ బాప మూ
రూరను బ్రాకిపోవు; మహి♦తోన్నతకీర్తి నశించు; నాపయిన్
నారకనాయకుం డడిగి♦నన్ బదు లిచ్చెద మేమి? కామినీ! ౨౯

ఉ॥ ఆతని కీయఁగాఁ దగిన ♦ యట్టిసుతర మాహసేయు, పైఁ
బ్రీతిగ వాంఛితమ్ము నెఱ♦వేర్చెద, నోపిక పట్టు మన్న నీ
రీతిఁ గనుంగొనన్ గవయు ♦ లీలఁ గన్పడ దేమిసేయునో
కొక్కు తుద కతఁ డంచు దిగు♦లూని చురుక్కున వానిఁ జూచుచున్. ౩౦

వ॥ అక్కలకంఠి యిట్లనియె.

చ॥ చదివితి వంట! భాసురర♦సప్లుతకావ్యము లల్లితంట! స
ద్బుధవినుతాదరంబులకుఁ ♦ బొంగితి వంట నృపాలగౌరవా
స్పదుఁడ వటంట! త్రిమ్మరఁగఁ ♦ జాలితి వంట ప్రపంచ మెల్ల! నీ
కిది పథ మంచుఁ జెప్పఁగల♦దే యొకమగ్ధ? కవీంద్రచంద్రమా! ౯౧

వ॥ అదియుంగాక.

ఉ॥ ఆవలఁ జూచుకొంద మది ♦ యౌనని కాదని యిప్పు డేల నం
చా విరిఁబోఁడి పల్కి మది♦నాతురభావము నూప వాఁడు త
న్వీ, విను మీ వొనర్చిన ద♦కృత్య మఘాస్పద మంచు నెన్నఁ డే
భావమునన్ దలంచెదె? య♦నన్ విని యాపె వినిశ్చితాత్మయై. ౯౨

వ॥ వినయమ్మున నిట్లనియె. నాహృదయం బొరుల కర్పించి నీకడ జార
త్వం బొనర్చుటకు వచ్చినదానఁ గాను; వృద్ధునితోనైన వివాహమ్ము సమ్మతిం
చిన దానఁగాను; వివాహకాలమ్మునందలి ప్రమాణార్థమ్ము లతిక్రమించి చేసి
యుండమిచే వానికే నుత్తరవాదిఁ గాను; వివాహమైన నింతవర కంటువడిన
దానను గా ననియే నీవు భావింపు; పుట్లగుటు నాకుఁ బాప మెట్లు? అది
యుంగాక.

చ॥ మలయసమీరసూను నదు♦మంత్రుపుఁ గౌఁగిలి కంద వీపరీ
మళములు; తేఁటినోటి కణు♦మాత్రముఁ జిక్కని వీ మరందధా
రలు; నునుమంచు తువ్వరఁ గ♦లం గని వీ నవకమ్ము లింత ని
ర్మలినపవిత్రమానసను♦మమ్మునకా యఘభీతి? సత్కవీ! ౯౪

తే॥గీ॥ సర్వసాక్షిస్వరూపుండు ♦ సాక్షి యింక
నెవ్వ డేనియు నేరికి♦నేనిఁగాని
నాహృదయ మర్పణముసేయ ♦ నమ్ము మిదియె
త్రికరణవిశుద్ధ నీ కిచ్చి♦తిని గ్రహింపు. ౯౫

చ॥ అన విని యాతఁ డామెమొగ ♦ మారసి యందుఁ గలంత నింతయేన్
గనక మనమ్మునందు నగుఁ♦గా కిఁక నేనును బెండ్లి వీడి దీ

నిసె నిజపత్నిగాఁ దలఁతు • నిక్కముగా; నటులైనచో లవ
మ్మును వృజినమ్ము లేదని ప్ర•మోదము నొంది పరాంబ నెంచుచుఁ. ౯౬

సీ॥ ఏకపత్నీవ్రతం•బే కదా నరునకు
హృత్తనూదార్ఢ్యము • లిచ్చువందు
ఏకపత్నీవ్రతం•బే కదా జను నిట
నజరామరణుఁ జేయు•నట్టివ్రతము
ఏకపత్నీవ్రతం•బే కదా జీవికి
బ్రహ్మతేజ మొసంగు • భవ్యశీల
మేకపత్నీవ్రతం•బే కదా మానవుఁ
బాపాబ్ధినుండి కా•పాడు నాక

తే॥గీ॥ ఏకపత్నీవ్రతంబె కా • యిహపరార్థ
సకలసంపతు లిడి మర్త్య • సాకుగురువు
ఏకపత్నీవ్రతంబె య•హీనఫలద
మదియ నా కీయుమమ్మ లో•కైకజనని! ౯౭

తే॥గీ॥ అంబ! కూర్చుచునుంటి వీ•యన్నుమిన్న
నిదియె పెండిలిమూర రమం • చెంతు మదిని
నేకపత్నీవ్రతమ్ము నా • కీయుమమ్మ
చేయుమమ్మ శుభంకరా•శీస్సు లిపుడు. ౯౮

తే॥ సీ॥ అంచుఁ బ్రార్థించి లోన ని•ట్లనియె, వృద్ధ
భగనుంగూడ భక్తితా•త్పర్యవినయ
నయములం గొలు నని ప్రమా•ణమ్ముఁ జేయు
మా! యన నతండు, నాలేమ • యల్లన నగి. ౯౯

తే॥ గీ॥ కపటకృత్యమ్ము సలుపనొ•గ్గను, మదీయ
మానసము నీ కొసంగి, య•వ్వాని మోస
గింప యత్నింపఁదగునె? య•గింపవచ్చు
నింతధర్మజ్ఞు నిన్నుఁ గ•వీంద్రచంద్ర! ౧౦౦

26239
2·3·73

వ॥ అనిన నతండు.

తే॥ గీ॥ అతఁడు వృద్ధుండు కానఁ ద్వా◆దంచితెప్పి
తమ్ముఁ దీర్పలేకుంట నీ◆చమ్ము నాక
యిట్టిపని కొప్పితివి కాని ◆ యెప్పుడేని
యాతఁడే నీ ధవుండు సు◆మ్మా! వధూటి! ౧౦౧

తే॥ గీ॥ కావునఁ బ్రమాణము నొనర్పఁ ◆ గడఁగవలయుఁ
జేయుటకు నిచ్చ లేకున్నఁ◆జేసి పిదపఁ
దప్పునెంచితివేనియు ◆ నెప్పుడేని
మనప్రణయబంధములు వీడు◆మాట నిజము. ౧౦౨

తే॥ గీ॥ అనినఁ జెలి తప్పుకొనలేక ◆ యతనికరము
నందుఁ గర ముంచి మీసాక్షి ◆ యతనిసేవ
సలిపెద నటన్న నామె నం◆గుళులఁ బట్టి
యంక్కనం జేర్చి, తన్మయుఁ◆డై యతండు. ౧౦౩

తే॥ గీ॥ ప్రణయిని! నా తిరస్కార◆వాక్యకలనఁ
గినుక రేకెత్తెనేమొ, నీ ◆ మనమునందు
నితనిచే నేమి పనులు సే◆యింపఁ దలఁతొ
యట్లు చేయించుకొనుము నె◆య్యమున ననిన. ౧౦౪

తే॥ గీ॥ మైనగుర్పొడువంగ, న◆మ్మదవతీ శి
రోవతంసము, గంధమ్ము ◆ నలఁది యతని
యురమునందున, విడె మీయ ◆ నుత్సహించి
యతఁడు నాశ్లేషసౌఖ్యసం◆గతులఁ దేలి. ౧౦౫

సీ॥ పఠియించుటే కాని ◆ స్వానుభవ మ్మెఱుం
గక తాపమొందిన ◆ కలికిమిన్న
నుద్రేకమే కాని ◆ యుక్తి నొక్కింతేని
నేరక సిగ్గొందు ◆ నీటుగత్తెఁ
గులుకుపల్కులె కాని ◆ కల కళామర్మమ్ము

లరయఁగాఁ జాలని ♦ యలరుఁబోఁడిఁ
గనుమాతలే కాని ♦ కవిసి ప్రతిక్రియ
లొనరింపలేని న♦వోత్పలాక్షి

తే॥ గీ॥ సరసశృంగారవేషభా♦షణలె కాని
చతురసంతాడనాద్యుప♦రతివిధాన
శూన్యయగు వివశాంగి నా ♦ సుకవివరుఁడు
సడలని కవుంగిఁటం బట్టి ♦ శయ్యఁ జేర్చె. ౧౦౬

... ... ...

ఉ॥ అమ్మదగంధయానయును ♦ నాతఁడు నానిశి నే యపూర్వసౌ
ఖ్యమ్ముల మున్గిరో యెటుల ♦ నామెయభీష్టముఁ దీర్చెనో యతం
డిమ్మెయిఁ బ్రొద్దుప్రొద్దున వ♦చించెడు వాడియు నెమ్మె లూనుపు
ష్పమ్ములు శయ్యామధ్యమునఁ ♦ జల్లని గాలికి మెల్లమెల్లఁగాఁ, ౧౦౭

ఓమ్.

శ్రీమ త్పురాంబికాయై నమః.



# శ్రీ రసాశ్రయము.

## ౪వ దళము.

తే॥ గీ॥ అత్తకోడండ్రు ప్రాక్పశ్చి◆మాబ్జనేత్ర
లుదయసంధ్యలఁ గ్రోధారు◆ణోరువదన
లగుచుఁ గొండాడఁ గని మిత్రుఁ ◆ డఖిలసముఁడ
నరయుఁ డనినట్లు గగనమ◆ధ్యమున నిలిచె. ౧

వ॥ అట్టియెడఁ గమల.

ఉ॥ భోజనముం బొనర్చి పరి◆పూర్ణసుఖస్థితిఁ దమ్ములం బిడం
గా జతనం బొనర్చు చిటు◆గానవె, శుద్ధవిరాగిపోల్కి నీ
నాజని నిష్ఫలమ్ముగ ది◆నమ్ములు పక్షములున్ సమల్ తటి
త్రేజములీలఁ బోయెడు నె◆దేఁ దరియించు తెఱంగు కల్గునే. ౨

మ॥ అని నిట్టూర్పున జీవ మున్నవరకే కా, ప్రాణబంధ్వాళి మ
న్ననమై వీక్షణఁజేయుచుండు రవల౯ బాపంబొ, పుణ్యంబొ; జీ
విని వెన్నంటుఁగదా; కలి౯ సుకృత మే వెంట౯ లభించు౯ విమో
హ నరౌఘమ్మున కౌనతీయుఁ డను భార్య౯ గాంచి వృద్ధుం డెదన్. ౩

వ॥ ఆశ్చర్యమ్మున నొక్కింతతడ వా లేమం గాంచి సూర్యోదయాది
యా మె ప్రవర్తన మారియుంటచే నిక్కముగా నామె పశ్చాత్తప్త యైయున్న
దని నిశ్చయించి యి ట్లనియె.

శా॥ దాఁటె౯ గాలము వత్సరమ్ముపయి నో తన్వంగి! యెన్నండు నీ
మాటల్ భావము లిట్టు లుండవు, కతం బా తోఁప, దేలా యిటుల్
వాటిల్లె౯ మదిలో విచారము? వచింపంబూనుమా, యన్నఁ దాఁ
గాటిల్యంబున నిట్లు వల్కెఁ గమలాకంజాక్షి యావృద్ధుతో౯. ౪

చం॥ దినదినము౯ గతించెడు సుదీర్ఘతరాయువు మృత్యుగహ్వరం
బునఁ బడుకాల మీక్షణమొ, ముందు క్షణంబొ; యెఱుంగరా దిఁకీ
మనుజభవమ్ము కల్గు ననుమాట యబద్ధము, మాయసంసృతి౯
జనక తొలంగుఁ డన్నవచనమ్ములు నాఁటె మనమ్మునందున౯. ౫

మ॥ అదిగా కీయువతీప్రతాన మెదలోఁ బ్రాణేశు నర్చించినం
త దురంతాఘము లార, ము క్తిసతి మోదంబార మన్నింప స్వ
ర్గదిరాక్షీనివహం బజస్రము భజింప౯ వెలువా రంచు విం
టిఁ దదర్చావిధి నా కెఱుంగఁ జెపుడీ నెయ్యంబు దైవారఁగన్. ౬

వ॥ అనిన వృద్ధుండు పట్టరాని కుతుకమ్మున.

శా॥ నీ కీమాత్రము మంచిబుద్ధి కలదే! నిన్ నామనంబందుఁ జిం
తాకంతేని విచార ముండదు నెలంతా! ప్రోన్నతం బైన నీ
యా కాంక్ష౯ జెదరంగనీను; నిశి కత్యంతానురక్తి౯ దద
ర్చాకల్పమ్ము సవిస్తరమ్ము విన నేర్పాటుల్ ఘటింతు౯ జుమీ! ౭

వ॥ అనిన నాబోఁటియు.

తే॥ గీ॥ తతపురాణమ్ములందు సం◆తతసతీజ
నానుకూలపథమ్ము లే◆మైనఁ గలవె
కలుగుచో నేరిచేనైనఁ ◆ గ్రమముగాఁ బ
ఠింపఁజేయరె, వాని నా◆లింపఁదలఁతు. ౮

వ॥ అన వృద్ధుండు.

తే॥ గీ॥ కల పురాణమ్ము లన్నియుఁ ◆ గలుగు నింటఁ
జెప్ప మనవాఁడు గలఁడు? నీ◆చిత్తమంతఁ
బొదలు కోరిక నీనాఁడు ◆ మొదలుగాఁగ
యువతి! తీర్చెదఁ దక్కువే ◆ ముందు నీకు. ౯

తే॥ గీ॥ అనిన మోదమ్ము తొలుకాడ ◆ నావధూటి
ధవు నడుగుఁదమ్మిఁ గేల నొ◆త్తం దొడంగెఁ
జిత్తము కళానిధిపదమ్ము ◆ లొత్తుచుండ
నిది యెఱుంగని వృద్ధుఁడుఁ ◆ ముదమునొందె. ౧౦

వ॥ అంత సాయంతన మగుడు నందయ్య కళానిధిం బిలిచి.

తే॥ గీ॥ నేఁడు మొదలు పురాణముల్ ◆ నియతితోడఁ
జెప్పుకొందము రాత్రి భో◆జనములైన
పైన నే రెండుగంటలో; ◆ మానసమున
నీకు నిది సమ్మతంబని ◆ నిశ్చయింతు. ౧౧

తే॥ గీ॥ అనిన నాతండు వల్లెయ◆టంచుఁ బల్కె
తన మనోహనిరాఘాట◆తను వహించె
నింకఁ గొదవేమి లేదని ◆ యెలమినొందెఁ
జిత్త మొసఁగినఁ గామిని ◆ చేయ దేమి?

వ॥ అంత నందయ్య వైళంబ భోజనం బొనర్చి రమ్మనుటయుఁ గవి
చిత్తమని చని కాల్యకృత్యమ్ము లొనర్చి చనుదెంచిన వృద్ధుం డమితోత్సా
హమునఁ బడకగదివెనుక ఖాళీప్రదేశమ్మునఁ దివాసీ పర్చించి తా నాసుదు
దిండ్ల నధిష్ఠించి, కమలను శయ్యాగృహకవాటపార్శ్వమున నాసీనం జేసి

పురాణములలో మున్నందు కాశీఖండమందలి పతివ్రతాపద్ధతులఁ బఠింపు
మనఁ గవి. ౧౩

తే॥గీ॥ పనసతొన లొల్చి తేనియఁ ♦ బంచదార
మెదిపి నోటి కందిచ్చిన ♦ విధముగాఁగ
మధురమధురాయమాణస♦మంజసార్థ
వచనరచనల వారిభా♦వములఁ గరఁచె. ౧౪

తే॥గీ॥ శేషము విశేషముఁ బద♦శ్లేషభావ
రసనిగూఢతాత్పర్యతా♦క్రమము లెల్లఁ
దన్మయుఁడు మనోహరగళ♦ధ్వనియుతుం డ
తండు వాకొనె వారి డెం♦దమ్ము లలర. ౧౫

శా॥ కాశీఖండమునఁ సతీజనలస♦ద్గాథాప్రతానమ్ము వి
ద్యాసంపన్నుఁ డతండు వాకొనెడుచో ♦ నయ్యాల్మగల్ వాని వా
చాసారస్యము నుగ్గడించి తల లూఁచఁ జాగి తచ్ఛేముషీ
న్యాసప్రౌఢికి హర్షమంది రెదలం ♦ దాశ్చర్య మేపారఁగఁ. ౧౬

వ॥ అంతఁ గొంతవడికిఁ బ్రొద్దువోయిన దింకఁ జాలింపుమని నందయ్య యితరప్రసంగంబులం దిగిచి, కడకుఁ బయిమేడ కేగుటకు వీథిమార్గము 'ద్రావిడప్రాణాయామమ్ముగా' నుండుఁగానఁ బురాణసమయంబుల నీపథమ్మున నడచుచుండు మని బీగమ్ముఁ దెప్పించి యొసంగఁ గవి చిత్తమని తన యావాసంబున కరిగెఁ; గమలయు వృద్ధునితో లోనికిం జని యతని పాదప్రక్షాళన మాచరించి పయ్యెఁటచేఁ దడియొత్తి శయనించిన యతని పదంబు లొత్తుచు మత్పూర్వావజ్ఞత లన్నియు క్షమింపుఁడని కుహనాదుఃఖం బభినయించి, వృద్ధుని యుపలాలనఁ బొంది, వీవన చేఁబూని యతండు బాగుగా నిద్రించువరకు సేవించి, పిదప గాఢనిద్రాముద్రితుం డగు నతని వీడి కళానిధిచెంతకుఁ బోయి, నిదియ నిత్యకృత్యమ్ముగాఁ గొన్ని దినములు గడచె నంత.

శా॥ మాయావాగురఁ జిక్కి వృద్ధుఁ డెద బ్ర♦హ్మజ్ఞాని వాఁ డంచు, నెం
తే యత్యుత్తమ యంచు భార్య, మది సం♦దేహమ్ముఁ బోఁద్రోసి యా

మాయావిన్ గవినిన్ యథేచ్ఛగతిగా ♦ మాటాడ రాఁ బోవ మో
దాయత్తస్ఫురితావకాశములఁ దా ♦ నై కల్పనన్ జేసినన్. ౧౮

తే॥గీ॥ వింత వినయమ్ములు గపట ♦ ప్రేమ లతివి
రాగభాషణలు పురాణ ♦ రసనిమగ్న
కృత్యములు సేయుచున్ బత ♦ హృదయసీమ
నధివసించె నాజాణ మా ♦ యాబలాన. ౧౯

వ॥ కవియు.

సీ॥ భారతసంపత్తి ♦ బాహాటముగఁ జూపి
యయ్యాల్మగల మెప్పు ♦ లందినాఁడు
రమ్యప్రబంధమా ♦ ర్గమ్ము లన్నిఁటిఁ జాటి
యయ్యాల్మగలనుతు ♦ లందినాఁడు
సర్వకళాచాక ♦ చక్యమ్ము వెలయించి
యయ్యాల్మగల ద్రవ్య ♦ మందినాఁడు
మహితాత్మరాగత ♦ న్మయులఁ గాఁ గావించి
యయ్యాల్మగలకూర్మి ♦ లందినాఁడు
తే॥గీ॥ తతవచోరచనావినో ♦ దప్రసంగ
గతులఁ గరగించి యవ్వారి ♦ కౌతుకముల
కొజ్జయై నిల్చినాఁడు, రే ♦ యుంబవళ్లుఁ
దన్ననుసరింప వారలా ♦ ధన్యమూర్తి. ౨౦

వ॥ మఱియు.

ఉ॥ జాతులు నొక్కటౌట సర ♦ సమ్ము లెఱింగిన ప్రోడయౌట సం
ప్రీతి గణించువాఁడగుటఁ ♦ బిన్నగుటన్ గులశీలరూపమే
ధాతత వైభవుం డగుటఁ ♦ బ్రాణసమానునిగా నిరంతరం
బా తలిరాకుఁబోఁడి కను ♦ నా కవివర్యు నతండు మేలనన్. ౨౧

మ॥ దినభోగక్రమపాటవాంచిత కళా ♦ దిస్థానసౌఖ్యాత్మత
స్వనపాండిత్య మనూనబంధనలస ♦ చ్చాతుర్య మాశ్లేషచుం

బనకాలజ్ఞత తాడనాద్యపరతి♦ప్రావీణ్యమున్ బుష్కలే
తనవిద్యానిధి వాఁడు నేర్పెఁ జెలి క♦త్యంతానురాగమ్మునన్. ౨౨

తే॥ గీ॥ వాని నామమ్మె తతకళా♦స్థానసీమ
యతని మూర్తి కాంతౌఘవ♦శ్యౌషధంబు
వాని వాగమృతంబు వి♦ద్వత్ప్రియంబు
వానిఁ గాంచి హర్షింపని♦వారు కలరె. ౨౩

మ॥ కవితామాధురినిన్ బురాణముల సౌ♦ఖ్యంబందు నుద్యోగపున్
వ్యవహారమ్ముల శిష్టదుష్టుల ధన♦వ్యాపారమందున్ గృహ
సవిశేషమ్ముల సర్వకార్యముల వృ♦ద్ధస్వామి యానల్ పొన
ర్చు విధుల్ మీఱక, యాపయిన్ జరకు మె♦చ్చుల్ పొందునె స్నేనియున్.

ఉ॥ బాంధవుఁడై కవీంద్రుఁడయి ♦ భ్రాతృసమానుఁడునై సహాయుఁడై
బంధురతత్త్వశాస్త్రగురు♦వర్యుఁడునై వ్యవహారకార్యసం
బంధుఁడునై శ్రితుండునయి ♦ మాన్యుఁడునై సుపురాణవక్తయై
యందు నతండు గౌరవము ♦ నా జవరాలు నతం డొసంగఁగన్. ౨౫

సీ॥ "ఏమోయి" యని కూర్మి ♦ వృద్ధుండు చనవీయ
"యేమయ్య" యని చెలి ♦ ప్రేమఁ జూఁప
మన్నన లొనరింప ♦ నున్నతోద్యోగులు
కవివర్యుఁ డని బంధు♦గణము మ్రొక్కఁ
"జిన్నయ్య" గారంచు ♦ సేవకుల్ కొలువంగఁ
జిన్నపంతు లటంచు ♦ శెట్టు లనఁగ
"నేజంటు" గారంచు ♦ నెల్ల పౌరులు పల్కఁ
దగునయమ్మును గుమా♦స్తాలు చూప
తే॥ గీ॥ నందఱికి నాశ్రయుఁడు విన♦యాన్వితుఁడు వి
రాగమయుఁ డన్యకాంతాప♦రాఙ్ముఖుండుఁ
బ్రేమమయుఁ డౌచు నతఁడు వ♦ర్తించుచుండె
స్వర్ణదుర్గాంబికాంఘ్రి భా♦వమున నమ్మి. ౨౬

వ॥ మఱియు.

మ॥ కొడుకుం గోడలు రీతి వారిరువురుం ♦ గూర్మిన్ దనుం గొల్వ నె
ప్పుడు వేదాంతవిచారణంబున మనం♦బున్ నిల్పి నిత్యప్రమో
దుఁడు, శాంతుండు, విరాగి, దానపరుఁడున్. ♦ ధూతాఖిలాందోళనా
త్ముఁడునై వృద్ధుఁడు కాలమున్ జరుపు నా♦మోదప్రపూర్ణంబుగాన్.

వ॥ ఆముగుదయు నొక్కతఱి తన మనంబున గళానిధి నెంచి యిట్లని వితర్కించు.

క॥ ధన మిడి కొమ్మని, బతిమా
లినను గొనం డొక్కనాఁడు ♦ ప్రీతిగఁ గొన్నన్
ఋణపడితి నంచు వాకొను
మన మీయం డెట్లు వాని♦మనము నెఱుఁగుదున్. ౨౮

ఉ॥ సమ్మతి నన్ విరాగి జను♦చాయలఁ జూచి సఖీ! సముద్రమ
ధ్యమ్మున బాడబానలవి♦ధమ్మున, నీచసుఖైకపాపమా
ర్గమ్ము ప్రచండకీలిగతి♦ గాఁ గనుపించు నొకొక్కవేళ భా
వమ్మున నంచుఁ బల్కు నిడు♦వాల్గను లంతనఁ జెమ్మ తేఱఁగాన్. ౨౯

ఉ॥ హోమము సేయుచుంటి మద♦నోద్ధతశాతశరాగ్ని సర్వశా
స్త్రస్మృతినీతివాక్యనిచ♦యస్ఫురదస్మదుదంచితాత్మ ని
ష్ఠామహిమమ్ము యౌవనర♦సమ్ము ఘృతమ్ముగఁ గామినీజన
స్తోమమనోజ్ఞవీక్షణలు ♦ సుస్రుక్స్రువయుగ్మముగా నితాంతమున్. ౩౦

తే॥ గీ॥ సఖి! స్మరప్రీతిగాఁ జేయు♦జన్న మిదియ
దీనిఫలము విచారింప♦రాని దవని
నొసఁగుఁ దాత్కాలికానంద ♦ ముసురు వీడి
నంతఁ బడఁద్రోయు నరు నిర♦యాగ్నికీల. ౩౧

మ॥ అను, నుత్సాహము వీడుఁ, గార్యగతులం ♦ దాసక్తినిం బాయు, మో
మున దైన్యమ్ము నటింప బాష్పసలిల♦మ్ముల్ కాల్వలై పార నే
డ్చును, నేమో యను, వెఱ్ఱిమాదిరి నొకం♦డున్ దిమ్మఱున్, నాథుప్రా
ర్థనచే నంతన జింత లెల్లఁ దొలఁగన్ ♦దాఁ గామియై క్రాలెడున్. ౩౨

వ॥ వాని నెట్లేనిఁ బరిపూర్ణవశంవదుఁగా నొనర్చుకొనం దలంచుచు.

సీ॥ కావ్యమ్ములం బఠించి ♦ కల సందియమ్ముల
నోర్మిమై నడుగు నొ♦క్కొక్కమాటు
పద్దెమ్ముల రచించి ♦ దిద్దుఁడీ దోసమ్ము
లున్న వేమో యను ♦ నొక్కమాటు
జయదేవఫణితసం♦చయము వీణియఁ బాడి
యుల్లమ్ము గరగించు ♦ నొక్కమాటు
హాస్యరసప్రసం♦గాలోలయై ప్రియ
దోల్లాసుఁ గాఁ జేయు ♦ నొక్కమాటు
తే॥ గీ॥ ఆశుధారాకవిత్వమ్ము ♦ నాతఁ డల్ల
నూఁకొనుచు వ్రాసి మెప్పించు ♦ నొక్కమాటు
ఆ కవీంద్రుని ప్రణయసిం♦హాసనమున
నధివసింపంగ నెంచి యా ♦ యలరుఁబోఁడి. 33

వ॥ అతండును.

శా॥ సంతాపించు నొకొక్కవేళఁ గట! య♦శ్రాంతప్రమత్పూర్ణ వే
దాంతానంతపథాంతరోద్విహారణ♦స్వాంతుండ నా నన్ను నీ
కాంతానూనదృగంచలాస్త్రవితతుల్ ♦ కామాంధకారచ్ఛటా
క్రాంతాఘోజగతిన్ బడన్ జలిపె నా♦రా! యే మొనర్పందగున్. 34

శా॥ భాషానూనపురాణధోరణికి భా♦వంబంది హర్షించు స
ద్వ్యాసంగంబున గౌరవించుఁ జనవున్ ♦ స్వాతంత్ర్యముం గూర్చు జి
జ్ఞాసాప్లావితభక్తి బంధురత ని♦చ్చన్ మెచ్చు నీవృద్ధు వి
శ్వాసద్రోహము సేయుచుంటి నకటా ♦ వ్యామోహమత్తుండనై. 35

ఉ॥ ఆలుడియా నశించె, సుఖ♦మా దురితాలయ మయ్యె, శాంతమా
తూలె, నహర్నిశమ్మును ఎ♦దో యిది యంచు నెఱుంగరాని యాం
దోళనచేఁ గృశించె మది, ♦ ద్రోహము ద్రోహ మటన్న నీతివా
క్యాళి వినంబడున్ గలికి ♦ కాల్నడ సవ్వడి దూర మానెడన్. 36

ఉ॥ దాని దృగంచలమ్ములును ♦ దాని విముగ్ధవచస్సుధాగతుల్
దాని విలాససంపదలు, ♦ దాని విజృంభితకేళికౌతతుల్,

దాని మనోహరాకృతియు, దాని సపర్యలు మానసోరువీ
క్షానపథమ్ములన్ మెలుపఁజాలు క్షణ క్షణ మక్కటక్కటా!

క॥ నను నమ్మి ప్రాణవిత్తము
లను మదధీనముఁ బొనర్చి పరిణయామృతవా
రిని మగ్న యగుచు నొండెఱుఁ
గని కామిని నవలఁ ద్రోయఁగాఁ దగవగునే? ౩౮

తే॥ గీ॥ ఇరువురందున నెవ్వారి కేనిఁగాని
నే కృతఘ్నుండ నగుటది నిశ్చయమ్ము
నొసఁట వ్రాసెను మూఁడుబంతులను దీర్చి
ధాత యింకెట్టు లీవిధి తప్పు నాకు? ౩౯

మ॥ అని చింతించి వివాహముల్ విడువ న్యాయంబౌనె, యిన్నాతి నం
దనులే నాకును గర్తలౌదురె! ప్రతిజ్ఞందోసి వేఱొక్క కాం
తను బెండ్లాడిన నారకాగ్ని వెనువెంటన్ గాల్పదే మించిపో
యినయద్దానికి నిట్లు చింతిలఁగనౌనే యంచు నుత్సాహియై. ౪౦

తే॥ గీ॥ అతనిగాఢపశ్చాత్తాపతతతమస్సు
కాంత, శారదకాంతేందుకరమయూఖ
జాలముల్ గ్రోలిసేయు హాసమున విచ్చు
క్షణికమున నేమి చిత్రమ్ము కలదొ దాన. ౪౧

తే॥ గీ॥ అంబికానివాసమ్మున కరిగి నప్పు
డొక్కఁ డేకాంతమునఁ జిక్కియుండి నప్పు
డెద్దియేని గ్రంథమ్ము పఠించునపుడుఁ
గుములు నతఁడు పశ్చాత్తాపఘోరవహ్ని. ౪౨

తే॥ గీ॥ ప్రణయవీచీపరిప్లావ్యభావు లగుచు
వారలీరీతిఁ దగుటగ వత్సరములు
గడపినంతన యా లేమ నడుము బలియు
చిన్నెల నెఱింగె నొక్క నిశీథమందు. ౪౩

వ॥ ఆముగుద కళానిధితో నావృత్తాంతము నుడువ నాతం డొక్కింత చింతించి, యామెం గాంచి యిదివృద్ధుని యనుమానమ్మునకు గుఱియగు విషయఁ; బతండు మున్ముందు నన్నుఁగూర్చి సంశయించు,, దాన మన కన్నేని యిక్కట్టులు గలుగు, నైనను. ౪౪

ఉ॥ ఎందుఁ జరించినన్ సరియె ♦ నీనివచోఁ దమగోష్ఠమందు నిం
పొందు జనమ్ములన్ గనుచు ♦ నుంటిమి, యాతఁడు డెందమందు నా
చందమె పూనుఁగాక నిది ♦ సాకుగఁ గైకొని లోకు లెల్లరున్
నిందల ముంపరే మనల ♦ నిక్క మెఱుంగుమరే ధరాజనుల్! ౪౫

వ॥ దీనికిం దగునుపాయం బూహింతు నీవు ధైర్యోత్సాహమ్ముల వీడ కుండుమని యామెకుం జెప్పి యామఱునాటిరేయి భారతమ్మునఁ గర్ణ జనన ప్రకారమ్ము పురాణమ్ముగా వినిపించి పిదప మంత్రి ప్రభావమ్ములన్ గూర్చి నందయ్య మదికి నాటు నట్లుపన్యసించి పిదప,

మ॥ ధనమున్ ధాన్యముఁ గీర్తియున్ మహితవి ♦ ద్యాభోగముల్ వైభవ
మ్మును మర్యాదయు సత్సతీమణియు నా ♦ మోదమ్మునుం గల్గి మీ
కనఘా! నందనుఁ డొక్కఁడుండమి నధ ♦ న్యతంబు సిద్ధించుఁ గా
వున నేమంత్రము నేన్ జపింపఁగఁ దలం ♦ పుం బూను టొప్పుం గదా.

వ॥ అనిన విని నందయ్య విషాదమ్మునఁ దల నూఁపెఁ; గమలయు నిట్టూర్పునధవునాననమ్ము విలోకించుచున్నయెడఁ గళానిధి.

శా॥ ధ్యానశ్రీపరిణామమంద నియమోద్య ♦ ద్భక్తి రూపొంద నే
శేనిన్ గాని హృదంబుజాతమున నెం ♦ తే నమ్మి తన్ గొల్వ భ
క్తానీకమ్ముల పాలికల్పకము లో ♦ కారాధ్యుఁ డాయీశుఁ డె
న్నేనిన్ వాంఛ లొసంగి కావఁడె యనన్ ♦ వృద్ధుండు దా నిట్లనున్. ౪౬

ఉ॥ ప్రాయము దాఁటె నిప్పుడు జ ♦ పమ్ముల కోపిక యెట్లుఁ గల్గు? నా
కీ యభివాంఛితమ్ము మది ♦ నెంతయు గాటము; మీవధూనికిన్
జేయు మటంచుఁ జెల్పు మది ♦ సిద్ధమ యైనఁ బ్రియత్న మెంతయున్
జేయుదు నే నటన్నఁ గవి ♦ నేర్పున నామెను వానిఁ జూచుచున్. ౪౭

తే॥గీ॥ అన్వయాభివృద్ధిద మైన ♦ యట్టిచేత
కామెమాత్రము వలదను నా ♦ యటంచు
నామెమోమున వాల్జూపు ♦ లమరఁజేయ
నామెయున్ లేతనవ్వు నిం♦డారఁ జూడ్కి. ౫౦

తే॥గీ॥ తలను వాంచి మీ రేరీతి ♦ సలుపు మనిన
నటు లొనర్పంగ సంసిద్ధ ♦ నవేల నన్ను
నిష్ఠురము లాడవల దన్న ♦ నెమ్మనమ్మ
నంమ వృద్ధుఁ డెంతేని యా♦నంద మొంది. ౫౧

వ॥ అటులయిన మంచిదని, మఱునాఁ డుదయమునఁ దగు దీక్షాపరు రప్పించి శుభముహూర్తమ్మునఁ గమలకు శ్రీసంతానగోపాలమంత్రం బుపదేశము సేయించె; నంత కమలయు దశదివసదీక్షాపరతంత్రయయి తన్మంత్రపురశ్చరణం బభినయించి కడకుఁ గళానిధి యానతిచే నొకనాఁటిరేయి సంభోగచిహ్నల మఱుగొనగ్నకయే వేకువజామునఁ దన గది కేగి శయనించె; నంత వృద్ధుం డుదయమ్మున మేల్కాని గాఢనిద్రాముద్రితయగు కమల నీక్షించి వెఱఁగందుచు నిట్లు వితర్కించె.

క॥ కలయో, భ్రమయో, నా దృ
క్కులలో నేదైన దోసఁగు ♦ కూడినదియొ యీ
లలితాంగి మేన నీ చి
హ్నలు వాస్తవములె? యటంచుఁ ♦ నాందోళనతోన్. ౫౩

సీ॥ తమలంపుఁ గెంజాయ ♦ తళుకొత్త నెవ్వాఁడు
ముద్దుల నిడెనో క♦పోలసీమఁ
బెరిమంపుఁ బల్లొత్తు ♦ లొఱయఁగా నెవ్వాఁడు
నానెనో నునుమోవి♦పానకమ్ముఁ
గళ లూఱఁ గ్రొంగోటి ♦ క్షతముల నెవ్వాఁడు
కావించెనో గుబ్బ♦కవలియందు
వలిపెంపుఁ బెళపెళల్ ♦ నులియంగ నెవ్వాఁడు
వదలించెనో నిండు ♦ వలపుకీలు

తే॥ గీ॥ పరువఁపుఁ బూలు వసివాళ్లు ♦ వడ నెవండు
సడలఁగాఁ జల్లెనో కీలు♦జడసొబంగుఁ
జిఱుతగాలుల కూఁగు ముం♦గురు లెవండు
చెమటచిత్తడి నెనయంగఁ ♦ జేసినాఁడొ. ౫౪

తే॥ గీ॥ అని తలంచుచుఁ గ్రోధమ్ము ♦ నబ్బురమ్ము
సందియమ్ము మనమ్మున ♦ సందడింపఁ
గా ననేకవిధమ్ములఁ ♦ గలఁత నొంది
యామె లేపంగ నూహించు ♦ నవసరమున. ౫౫

తే॥ గీ॥ ఆమె మేల్కాంచి లేచి త ♦ న్నరయుచున్న
యధిపుచరణమ్ములను గండ్ల ♦ కద్దికొనుచుఁ
దనను దా వింతగాఁ జూచు♦కొనుచు నిలువ
వృద్ధుఁ డీక్షించి యీ చిన్నె ♦ లేమి? యనిన. ౫౬

వ॥ ఆమె యించుక సిగ్గభినయించి పిదప భర్త్రసరసం గూర్చుండి రాత్రి యొక విచిత్రస్వప్నముఁ గంటి వినుఁడని యిట్లనియె.

మ॥ అది యుద్యానవనమ్ము సాంధ్యసమయం ♦ బావేళ సౌందర్యసం
పదచే నొప్పిన పూరుషుం డొకఁడు మ♦త్పాణిఁ దమిఁ బట్టి నీ
మది రాజిల్లునభీష్ట మిచ్చెదను ర♦మ్మా యంచు నేమేమొ చే
సెఁ దదీయ మ్మగుచేష్టలన్ దలఁచినన్ ♦ సిగ్గౌ మనంబందునన్. ౫౭

చ॥ కల యిది యన్న వృద్ధుఁ డెదఁ ♦ గౌతుక మంది వచించు స్వామి కా
వలయు సుతోదయం బగును ♦ భక్తులకొంగుపసిండి యీక్రియన్
గలఁ గనుపించె నన్నుఁ, గృత♦కక్రుధ దేవుఁడె యౌను గాక ని
ర్మలినపతివ్రతాత్వము గ♦లంపఁగఁ బొల్పడఁబోడి యౌనొకో. ౫౮

చ॥ అనసతి వృద్ధుఁ డట్లు పలు♦కాడఁగరా దపరాధ మౌను నీ
వనిశముఁ గొల్చుచుంట హృద♦యమ్మున మెచ్చి, రమించి కూర్చె నూ
నుని హరి యంతవాఁడు, మెయి ♦ నూత్నవిలాసము హెచ్చె నీకుఁ గా
వున జప మాపుమా యనిన ♦ బోఁటి ప్రమోదము నందెఁ బిమ్మటన్.

శా॥ సంతానం బిడఁ బోకృపాకరుఁడు శ్రీ♦సంతానగోపాలుఁ డం
చెంతే సంతస మూనె, వృద్ధుఁ డెద నే♦దే యుక్తిచే వాఁడు నా
వంతేఁ జెందక బన్న మీఁగిత మటం ♦ చానందముం జెంది ర
క్షాంతమ్మున్ గమలాకళానిధులు దు♦ర్గాదేవి ధ్యానింపుచున్. ౬౦

తే॥గీ॥ భార్యకుం జూలు నిల్చె నన్ ♦ పలుకు వినిన
యటువదేఁడు లేగిన♦తరుణమందు
నెవ్వఁ డానంద మొందఁడీ♦పృథివి నల్లె
వృద్ధుఁ డరుసమ్ముఁ గనె నెల ♦ లేగఁ గొన్ని. ౬౧

తే॥గీ॥ నేఁడు మాపాప పాపల ♦ వేడుకలకు
సలిపినట్టి తపోవ్రత♦సమితి కలరి
చూ లొసఁగె దేవుఁడంచుఁ జొ♦ట్టాలగములు
నూడిదల నిచ్చినార లా♦సుదతి కెలమి. ౬౨

వ॥ అట్టితటి యొకనాఁడు నందయ్య కళానిధిం బిలిచి.

తే॥గీ॥ నీవు నావాఁడ వన్నట్టి♦నెమ్మితోడ
భావమున నున్నదాని నే♦ర్పరుచుచుంటి
వేఱుగా నెంచఁబోకు స♦ర్వేశ్వరుండు
గురుకృపామూర్తి నాకోర్కె ♦ నెఱపినాఁడు. ౬౩

సీ॥ జిలిబిలి పువ్వుఁదేనె ♦ లొలుక ముద్దారుఁ బ
లుక్కుల గుల్కు నిసుఁగు లీ♦లలఁ దలంచి
తఱపి వెన్నెలనిగ్గు ♦ లొఱయఁ జెక్కులు సొట్ట
వారఁ నవ్వెడు కుఱ్ఱ♦పరువ మెంచి
పసిఁడిచాయలజిగి ♦ మసుఁగు లీనఁగ మేన
నొరపారెడు బిడ్డ♦సొరుఁ గాంచి
గడియ కన్మలుఁగైన ♦ మదుకున నేదేని
నవరించు బుడుతచే♦ష్టల నుతించి

తే॥ గీ॥ ముద్దు లొడికఁగట్ట, దో♦బూచులాడి
జగము మఱపించు చిఱుపాప♦చాయ లరసి

యయిమ్మాలికతోడ నిట్టి భాగ్యమ్ము నాకు
లేదుకా యని మదిఁ గుమారిలినవాఁడ.

తే॥ గీ॥ అతులితానంద దాయకమౌ యపత్య
ములకు నామె చేసినజపమ్ములకు మెచ్చి
కరుణమై స్వామి నేఁటికిఁ గలుగఁజేసె
మామకీప్సిత మీడేరుమార్గ మొకటి. ౬౫

వ॥ అదిగాకీసమయమ్మునఁ గాంత లనుత్సాహమ్ముగా నుండినను, దీరనివాంఛలచే దురపిల్లుచున్నను, శిశువు లల్పాయుష్కు లగుదు రను వృద్ధవాక్యం బొకటి కలదు. మన కది కర్తవ్యాంశంబు; మీ వధూనికకు నాయెడంగల లజ్జాభయమ్ముల పెంపునన్ జేసి, నాకుఁ దనమనోభీష్టంబుఁ దెలుపనిచ్చగింప; దట్లగుట నీ యెడంగల సోదరవాత్సల్యమ్మునఁ జనవున వర్తించుఁ గాన నామె కామ్యమ్ము లెఱుంగుచు నుత్సాహవంతురాలిఁ బొనర్చుచుండు మని పలికిన, నందయ్యతో వల్లె యని పల్కి కళానిధి తనసహజచాతుర్యప్రేమావలంబనముగఁ గమల సముత్సుకం జేయుచు, నామె కోర్కెలఁ దానె తీర్చుచుఁ గంటికి రెప్పవోలెఁ గాపాడుచు, నిముసమేని యెడబాటెఱుంగక కొన్ని మాసమ్ములు దాఁటిన నొక సంధ్యాసమయమ్మున వార లిర్వురు విలాసముగా శయనించి యున్నయెడఁ గళానిధి. ౬౬

మ॥ తన వక్షమ్మున శిర ముంచి, ప్రణయాగ్రస్వాంతయై గండపా
లిని గోరొత్తుల నించుచున్ సరసవాగ్లీలాచమత్కారసం
జనితానందవిలోల యైన కమలాస్యన్ బ్రేమచేష్టావితా
న నవోల్లాసనొనర్చి, గడ్డమును బుణ్కన్ జాగి, వాఁ డిట్లనున్. ౬౭

మ॥ కలికీ! దాఁటిన వేఁడుమాసములు విఖ్యాతావధానక్రియా
కలితాకాంక్షమెయిన్ విదేశముల కేగన్ మాని, మద్వాక్షిక
మ్ములలో గాసును జేతి కంద దిఁక రేపో మాపొ, పట్టాలు పో
గల విట్లుండినఁ గాన నేగవలయుంగా నానికై వైళమే. ౬౮

చ॥ అనవిని దైన్యమొప్ప వదనాంబుజ మందునఁ బుల్కుఫుల్కునన్
గనులను నీరు దేర బిగికౌఁగిటఁ బట్టి, మొగమ్మునన్ మొగ

మ్ము సమరఁజేసి. యిట్లనియెఁ ♦ బూనిక నింతటిప్రేమశూన్యఁపుఁ
బని నొనరింపఁ దోఁచెనె, మ♦నమ్మున నీసమయమ్మునన్ బ్రియా. ౬౯

తే॥ గీ॥ ద్రవ్య మపరస్థమైనఁ గొ♦ఱంతటోయి!
నన్ను నేరికి నొప్పగిం♦చన్ దలంచి
తోయి? నామీఁద దయ వీడు♦టొప్పదోయి
కాక నావల్ల దోసఁ గేమి ♦ కలిగె నోయి! ౭౦

వ॥ అదిగాక.

తే॥ గీ॥ పడఁతి చూలింతయని యొరుల్ ♦ పలికిరేని
భీతి దిగులునుదోఁచు మ♦చ్చేతమందుఁ
గలలలోనఁ గృతాంతుండుఁ ♦ గానుపించు
నా కనేకభంగులలోనఁ ♦ జీవు హెచ్చు, ౭౧

తే॥ గీ॥ జిఱ్ఱునన్ జీదకుండ నే♦చెదుగు లేక
నిసుఁగుతోఁ గూడఁ జెంబెడు♦నీరములను
బోసికొని బైటపడినపై ♦ బోవవచ్చు
నీ ప్రియాణంపుమాట లిం♦కెత్తవలదు. ౭౨

తే॥ గీ॥ అనినఁ గమలావ ధూటియా♦ననముఁ గాంచి
తుడిచి కన్నీరు సంత్రాస ♦ పడియెదేల?
దుర్నిమిత్తము లేటికిఁ ♦ దోఁపఁగలవు
చిరమనోరథ మీడేరు♦తరుణమందు. ౭౩

తే॥ గీ ఇది, వృథాభ్రాంతి యానాఁటి ♦ కేడ నున్న
వ్రాలనే నీమముంగల ♦ ద్రవ్యబాధ
కేమిగాని మనశ్శాంతి ♦ నిచ్చగింతు
విమలదేశాటనాపాట♦వమునఁ గలికి! ౭౪

వ॥ మఱియు మన మెన్నియుత్సు. లొనర్చినను లోకము గను గప్పుటు ము సర, మొక్కొక్కపుడు నావెనుక నేతెంచు విద్యార్థులు సైతము, 'కమలామనోహరా!' యని నాచెవి నాఁటునట్లు బలుకుచుండెద రది యట్లుం

డె, నీపరిణూతిదినమ్ములు సమీపించుటఁ జేసి నేఁట రేపఁట సన్నిహితబాంధవు లందఱే తెంచెద రింకమీఁదట మన మిట్లేకాంతమునఁ గాలము గడుపవలను పడదుగదా! కావున నాప్రయాణ మాపినను బ్రయోజనము గన్పట్ట దది యుంగాక. ౭౮

తే॥ గీ॥ భావవాంఛల నీడేర్చు • దైవతమ్ము
సద్గుణమ్ముల నేర్పఁగాఁ • జాలుగురువు
దానధర్మవిరునిఁ జేయఁ • దగినబాట
సత్కవీంద్రులసొమ్ము దే • శాటనమ్ము. ౭౯

సీ॥ తిరుగఁగావలె దేశ • దేశమ్ము లన్నియు,
నిలువఁగావలె సభా • స్థలములందు
వీక్షింపఁగావలె • విద్వద్వతంసుల
వెలయఁగావలె దండి • బిరుదములను
జేరఁగావలె రాజ • శేఖరావళిచెంతఁ
దనరఁగావలయు స • త్కారరాజి
వ్రాయఁగావలె రస • శ్రావ్యకావ్యమ్ముల
స్థాపింపవలె జయ • ధ్వజవితాన
తే॥ గీ॥ మార్జనము సేసినట్టియ • శోఽరవిత
తేజముఁ బెంప నసమాన • దీప్తితోడ
స్వీయగేహప్రవేశమ్ము • సేయవలయుఁ
బుడమి విద్వత్కవీంద్రసిం • హుఁడు లతాంగి! ౮౦

తే॥ గీ॥ ఏ నొకఁడ నుండకుండిన • నేమిలోటు
వాటిలెడు నీకు రక్తసం • బంధు లెల్ల
వచ్చువారలు దలపూవు • వాడనీయ
కనునిమేషమ్ము వారు ని • న్నరయఁగలరు. ౮౧

తే॥ గీ॥ పరిణయబంధంబు కాల్క • దల్పంగనీని
దగుటఁ బ్రస్థాన మాపఁగా • నలవికాని

దగుట, నీకన్న హెచ్చుగా నహరహమ్ము
బొగులుచున్నాఁడ నామనంబున లతాంగి! ౬౯

తే॥ గీ॥ కాన నెలలోన పతు నాపైనఁ గలుగు
నెమ్మిచే నుత్సుకత వీడి నెగులువడకు
సంతతము భగవద్గీతఁ జదువుకొనుము
సకియ! గర్భస్థశిశువు విజ్ఞాని కాఁగ. ౭౦

మ॥ అనఁగ న్నీరము కాల్వలై యురలఁ గాఢాశ్లేషమున్ జల్పి నె
మ్మనమందుం గరుణన్ వహింపు, భయకంపస్వేదయుక్తంబు నా
తనువుం జూడుము. నన్ను వీడు టిది కర్తవ్యంబె, ధర్మంబె? యే
పను లున్నన్ నను నీట ముంపకుము, సంప్రార్థింతుఁ బ్రాణేశ్వరా!

క॥ అని గోడుగోడు మనుచును
గనుకొలఁకుల నీర మురలఁగా నేడ్చెడు జ
వ్వని నక్కునఁ బట్టి కృపా
వననిధి యవ్వాఁడు నడలి పలికె ముగుదకున్.

ఉ॥ గోడున నేడ్వఁబోకు నను గూటిచి, నీకనుదమ్మినీరముల్
చూడఁగనోప నిన్విడువఁ జూచెదనే? మనగుట్టొకింత కా
పాడుటెకాక బాంధవులు భావములం దనుమాన మూనిరేన్
గూడదె, యప్రతిష్ఠ, తగునో! దురపిల్లఁగ నీవు బేలవై. ౭౩

తే॥ గీ॥ అనుచుఁ గన్నీరు తుడువ నాయబల సుంత
యోజన మొనర్చి, మంచి దేయూరి కేగి
నను లిఖింపుఁడు గమ్మలఁ గనికరమున
నని వచింపంగ నామె ముద్దాడి యతఁడు. ౭౪

వ॥ ధైర్యమ్ము కల్పించు వాక్యమ్ము లుపదేశించి మన మీస్వల్ప వియోగమ్మున కోర్చినఁ దిరిగి నిరాఘాటానంద మొందవచ్చును గదా! కాన నడలకుండుము. ౭౫

క॥ అని బుజ్జగించియుఁ బ్రియ
ముస్న గర్భమ్ముఁ దడవి శిశువు శిరము ముద్దుం
గొని, యల్లనఁ గౌఁగిటఁ జే
ర్చి నీ కలఁత తీరినదియొ? ప్రేయసి! యనినన్. ౧౬

వ॥ ఆమెయు.

ఉ॥ నీ యనురాగసంపదలు నీ సమయోక్తు లసత్యగాథ లే
మో యనుకొం దొకొక్కతఱి నున్నది యుండినయట్లు గన్పడెన్
నీ యెదయెల్ల నా కొఱకు నీ పను లేటికి మానుకోవలెన్
బోయి, నెలల్ గతింపకయ ము న్నరుదెంచు మనుగ్రహమ్మనన్ ౧౭

వ॥ అని గంటువారు పెదమోమునఁ గుందు నామె నూరడించి, ఖేదం బుడిపి ప్రహృష్ట హృదయన్ జేసి యామెచే వీడె మంది, నందయ్య నెట్టులో నొడంబరచి యారాత్రియే యతండు తనపయనమ్ము సాగించె.

---

ఓం.

శ్రీమ త్పురాంబికాయై నమః.



శ్రీ

# రసాశ్రయము.

## ౫వ దళము.

తే॥ గీ॥ ధూమశకటాధిరోహణ ♦ స్థేమచిత్తుఁ
డతఁడు పశ్చిమాధీశుస ♦ భాంగణమున
కరిగి యష్టావధానమ్ము ♦ నాచరించి
బహుళసన్మానవిసరముల్ ♦ వడసి యవల. ౧

సీ॥ తనకు మున్ బేర్పడ్డ ♦ ధాత్రీంద్రు లనువత్స
ర మ్మొసంగెడు గౌర ♦ వమ్ము లంది
తనపేరు ప్రాకిన ♦ తగిన సీమలలోన
యర్హసత్కారవి ♦ ఖ్యాతు లంది
తన గ్రంథములఁ జూచి ♦ కననెంచుకొనుచున్న
పండితౌఘస్తోత్ర ♦ పాత్ర మంది

తనను దైనందినోద్యద్గ్రంథరచనఁ బ
రీక్షించు నృపునమస్కృతుల నంది

తే॥ గీ॥ తనయశోర్థముల్గ కసూయఁగొనిన కుకవి
వితతులఁ దీల్పడఁజేసి విజ్ఞమిత్రి
గణబహూకృతు లంది దుర్గాపదాబ్జ
భక్తిసంభరితానందభావుఁ డగుచు. ౩

వ॥ ఒకనాఁడు తన మనంబున.

తే॥ గీ॥ రా జనినశబ్దమే తెంచురాజ్య మెల్లఁ
దిరిగి, కీర్త్యర్థముల నంది మురిసినాఁడఁ
బిలుపులం బొంది పట్టణములకు నేగి
ఘనతర వధానములఁ బేరుఁగాంచినాఁడ.

తే॥ గీ॥ ఈజయములైన ధనమైన నేమియైన
స్వర్ణమర్గాకటాక్షులబంధు లగుట
దానధర్మాదిపుణ్యసంధానకార్య
సమితి పెచ్చింతు నే నిమిత్తముగ నిలిచి. ౪

వ॥ కావునఁ దీర్థయాత్రి లొనర్చెద నని తన మనంబునఁ గృతనిశ్చయుండై కమల నెంచి.

మ॥ నెలలో వచ్చెద నంచుఁ బల్కితిని కానీ యట్లు బోకున్కిఁ దా
వలవంతఁ దురపిల్లునేమొ కపటవ్యాపారుఁ డంచాడునో,
తెలిసెఁ బీనినిజం బటం చనునొ. యెంతేఁ గార్శ్యతఁ జెంది దు
ర్బలయై పోవునొ, యేమిచేయుటకునై భావమ్మునం దెంచునో. ౫

ఉ॥ తప్పక నీవు రమ్ము నెల దాఁటెయు దాఁటకమున్న, లేనిచోఁ
జెప్పెడిదేమి చూడ వికఁ జీవముతో ననునంచు బాష్పముల్
ఱెప్పల నప్పళించు చొకరీతిఁ గవుంగిటఁ జిక్కి యేడ్చు నా
యొప్పులకుప్పవాక్యము లొకొక్కతటిన్ ధృతిఁదూలఁజేసెడుఁ. ౬

క॥ అదిగాక దైవచిత్రం
బది యేమొ లతాంగి నిముస♦మైనను గాని
వదలదు నను నిట్టులెకా
యొదవెడుఁ బూర్వానుబంధ ♦ ముండిన ధాత్రిన్. ౭

తే॥ గీ॥ ఏ ముహూర్తమ్మునందునఁ ♦ బ్రేమమయని
రీక్షణమ్ముల వియ్యముల్ ♦ నెఱపినామొ
యనునిమేషప్రవర్ధమా♦నానురాగ
వల్లి, యానాఁడె ముకుళసం♦పదఁ దనర్చె. ౮

ఉ॥ అన్నిఁటి కేమికాని, కడ♦నాడిన దాని వచోవిధమ్ము ని
ద్దెన్న విచారవారినిధి ♦ నెంతయుఁ ద్రోయు నదైనఁగాని కా
సున్నది కొకమానను. మ♦హోన్నత యాత్రల నెల్ల సల్పియే
యన్నువ చెంత కేగదను ♦ గాద్వరలో నని యాతఁ డెంచుచున్. ౯

వ॥ కమల కొక్కయుత్తరమ్ము లిఖించి, శుభముహూర్తమ్మున
నటనుండి కదలి.

సీ॥ జాహ్నవీవీచికా♦క్షాళితాఘుండయి
హిమశైలజేశు వి♦శ్వేశుఁ గొల్చి
పూతత్రివేణీప్ర♦శీతాంబువులఁ దోఁగి
యాశ్రితపక్షుఁ బ♦ద్మాక్షుఁ గాంచి,
ఫల్గునీనది మున్గి ♦ పావనపితృమోక్ష
దమ్ము శ్రీవిష్ణుపా♦దమ్ముఁ బొగడి
స్వచ్ఛగంగావిని♦స్వనదోలలం దేలి
ఖండితాసురసాళిఁ ♦ గాళి వేడి
తే॥ గీ॥ యఖిలశైవలినీనాథు♦నందుఁ గ్రుంకి
సాధుజననాథు శ్రీజగ♦న్నాథు నరసి
హేమదుర్గాపదాబ్జచిం♦తామనస్కుఁ
డాతఁ డానందనిర్మగ్నుఁ ♦ డై యొసంగి. ౧౦

వ॥ జగన్నాథమునం దొకనాఁడు తనమనంబున.

చ॥ మనుజుఁడు నై జనించి యస◆మానవిరాగవిశుద్ధబుద్ధితో
మునిఁగ పవిత్రతోయముల ◆ భూధరజాధవుఁ గొల్చి, సద్వటా
వనిజమునీడ సర్వపితృ◆వర్గఋణమ్ముఁ దెరల్చి నెవ్వఁడా
తనిజని సార్థకం బగుఁగ◆దా యిరులోకములన్ గృతార్థమై. ౧౧

తే॥గీ॥ జహ్నుకన్యాతరంగని◆స్వనము విన్నఁ
గోటిజన్మాఘగిరితతుల్ ◆ కూలిపోవు
హారతు లొసంగుము క్తిక◆న్యామతల్లి
విశ్వనాథాంఘ్రియుగళి సే◆వించినంత. ౧౨

తే॥గీ॥ తరతరమ్ముల పితృదేవ◆తలు స్వకర్మ
బంధములఁ ద్రెంచి యక్షయ ◆ బ్రహ్మపదవిఁ
జేరెదరటంట ఫల్గునీ◆శీకరప్ర
పోషితమ్ము న్యగ్రోధాగ◆మును భజింప. ౧౩

తే॥గీ॥ ప్రథితగంగేనజాసర◆స్వతుల గురుకృ
పామృతతరంగములఁ దోఁగు◆నట్టివారి
యతులమహిమమ్ము వాకొన ◆ నలవికాద
టంచు స్థలపురాణవ్రజం ◆ బాడుచుండు. ౧౪

క॥ మలఁగినవి పాపచయములు
తలఁగినది పితౄణభరము ◆ ధరమాన వజీ
వుల కేమి వలయు నిఁక ము
క్తిలలన చేరువఁ జరించెఁ ◆ గృప చెన్నారన్. ౧౫

వ॥ అదియుంగాక నీ జగన్నాథమ్ము నరయుటయుం గలిగె, సర్వ
విధమ్ముల మజ్జనిసార్థకంబయ్యె నని యతం డానందమ్ము నందునవసరమ్మునఁ
బండా యొకండు తన చిరునామాకవ రొక టందీయ నాందోళనమై యది
విచ్చి యిట్లు పఠించె. ౧౬

తే॥గీ॥ తావకీనామృతవచోవి◆ధానతత్త్వ
మరయలేక నాశానిరీ◆క్షాళి ననిశ

మాశలఁ దోరణఁగట్టు♦నట్టిదీన
హృదయ కావించుతుదినమ♦స్మృతి గ్రహింపు. ౧౭

తే॥గీ॥ ప్రణయతాపజ్వరమ్మునఁ ♦ బడి కృశించి
కనుగొలఁకుఁ వేడికన్నీటఁ ♦ గలసి చెంప
నంటఁగట్టిన చికురాల ♦ యబల నొకతె
కాంచితే? కవీంద్ర! స్వప్నరం♦గమునన్నైన. ౧౮

ఉ॥ కన్నులు మూసినంతఁ దనుఁ ♦ గాంచి హసించి యనేకరీతులన్
మన్ననలన్ బొనర్చునిజ♦నాథు నజస్రముఁ గాంచునాసఁ దాఁ
గన్నుల మోడ్చి శయ్యపయిఁ ♦ గాయము వైచి కవోష్ణబాష్పవా
రాన్నిధిఁ దోఁగులాఁడు ప్రియు♦రాలినిఁ ద్రోయునె యెట్టికష్టుఁడున్?

ఉ॥ నాయకుఁ డూరి కేగుతరు♦ణమ్మున బిగ్గ కవుంగలించి య
త్యాయతబాష్పరుద్ధగళ యై ♦ చుబుకమ్మునఁ జేయిఁ జేర్చి, వేం
చేయుము శీఘ్రమే యనిన ♦ చెల్వకు మాసములోన వత్తునం
చాయెడ బాసఁజేసినమృ♦షాత్మున కేవిధిశిక్షయో, సఖా. ౨౯

తే॥గీ॥ ప్రతినిశయు స్వప్నరంగాలఁ ♦ బ్రతిఫలించి
భయదదంష్ట్రికరాళవి♦స్ఫారవదన
దీర్ఘనేత్రుండు ననుఁగట్టఁ♦దివురు నాదు
భావిజీతవిపరిణామ ♦ పథము కాదె? ౨౧

తే॥గీ॥ నిన్ను నమ్మిన ముగ్ధ నీ♦కన్న వేఱు
దిక్కులేని యనాథ రా♦త్రింబవళ్లు
నినుఁ గలువరించు చెలువ కీ ♦ నీదుద్రోహ
మెంతవేదనఁ గూర్చునో ♦ యెఱుఁగలేవె? ౨౨

తే॥గీ॥ ప్రణయమూలంబు ప్రణయసౌ♦రభమయంబు
ప్రణయరంగంబు ప్రణయక♦ళాసమంచి
తంబు నగు సృష్టినాటకాం♦తరమునందుఁ
బ్రియు ప్రియము లేని కలికి యే♦వ్విధి నటించు? ౨౩

ఉ॥ కమ్మపయిన్ గనంబడెడు • కంకణచిహ్నము లేద యంచు భా
వమ్మున నెంచెదేమొ యసి•వాడి మనం బుడుకెత్తఁగాఁ ద్రవీ
యమ్మగు దర్శనమ్మునకు•నై విలపించు మదశ్రుబిందులం
జెమ్మకఁ జూచుకొమ్ము • సుకవీ! యివినాకడసారిచిహ్నముల్. ౨౭

ఉ॥ నమ్మిక నూన నాతుదిక్ష•ణమ్మున కేనియు వత్తు వంచు, ని
త్యమ్మభివృద్ధినొందిన, మ•హత్తరఁపుఁ బ్రణయమ్ము వ్రాయఁగాఁ
గమ్మయె చాలఁబోను చిర•కాల వియోగతరాగ్నితప్తదే
హమ్ముఁ దొఱంగుచున్న, హృద•యమ్మున నిన్నె స్మరింతు నమ్మమా.

తే॥ గీ॥ మామకీనవినిర్మల•ప్రేమమహిమ
సత్కుమారునిరీతి సా•క్షాత్కరించు,
గడియ దగ్గరెనంచుఁ గ•న్పడెడు నేఁటి
చిన్నెలన్ గాంచ నాఁటికే • జేరరమ్ము. ౨౮

తే॥ గీ॥ త్వత్కఠినభావసీమఁ గృ•పారసమ్ము
నాటుకొనెనేని యొకటి రె•న్నాళ్ళలోన
నాకు నేత్రోత్సవమ్ము నొ•నర్పనెంచు
మీ యదృష్టవిహీన, యిం•కేమి వ్రాయు. ౨౯

క॥ అను లేఖ చదివి, మదిఁ బొ
ర్లినదుఃఖాశ్రుల నడంచి • రేపటి కెటులేన్
జనవలె యాత్రాదిక మా
పను లెల్ల ముగిసెనటంచు • వాఁడు వగపునన్. ౩౦

ఉ॥ మానిని స్వప్నవృత్తము ప్ర•మాదముఁ గూర్చెడు నంచుఁ దోచు డెం
దాన, మదీయజాతకవి•ధానము సూచితిమేనియున్ గళ
త్రానికి నెట్టులేన్ దొసఁగు • తప్పదు, అయ్యది తప్పిపోవన
ల్లైన మఱంతదుఃఖవివ•శాత్ముఁడనై చెడిపోవనే విధీ!

తే॥ గీ॥ కమ్మ లిఖియించి మూఁడు ది•నమ్ము లేగ
దుర్నిమిత్తమ్ము లెన్నేనిఁ • దోఁచుచుండె

జితకుహూరమ్మునం దగ్గి • సెగ జనించెఁ
గలికి నీక్షించుభాగ్యమ్ము • కలదొ లేదొ! 30

సీ॥ సరిచేయమి మొగమ్ము • నరముసుంగునఁ ద్రోయు
చికురాలఁ గొనగోళ్లఁ • జిక్కుదీసి
కనుగూర్కు విడి దారిఁ • గాచికొంచి నిరాసఁ
దొరలిన కన్నీటి • తెరలఁ దుడిచి
తెలిజాళువా మెఱుం • గులు మాయ వసివాళ్లు
వడినమోమునఁ గ్రొత్త • పసలఁ గూర్చి
మదిఁ గుమారిలి పైకి • నొదవెడు నిట్టూర్పు
సెగలఁ గ్రాఁగినమోవి • జిగి ఘటించి

తే॥గీ॥ యోగిరమ్మును నిద్రయు • నొల్లఁబోమి
కంచువారి కృశించిన • కాయవల్లి
మఱలఁ బుష్పింపఁజేయ నె • మ్మనమునందుఁ
దలఁచుచుంటి దైవ మ్మెట్లు • తలఁచినాఁడొ ?

తే॥గీ॥ కమ్మ హా సగత! మ్మైన • క్షణము మొదలు
వామనేత్రం బదరుచుండె • భావమందుఁ
గారణము లేని దిగులు సం • ఘటిలె, నేమి
ముప్పు మూడంగనున్నదో • ముదిత కచట. ౩౧

వ॥ అని వాపోవుచు దైవమ్ములఁ గూర్చి మ్రొక్కుచుఁ దనయాత్రాదికము లన్నియు నాదినముతో సమాప్తం బగుటచే నారాత్రి ధూమశకటమ్ము నెక్కి ద్వితీయ దినోదయమ్మున.

తే॥గీ॥ బ్రహ్మతేజాన హరియంత • వానిప్రల్ల
దమ్ముఁ దూలించి స్వప్రభా • వమ్ము నడిగ
సలిపె నెవ్వాఁడు వానియా • శ్రమము సేరి
గౌతమీగంగ, గంగ నై • క్య మ్మొనర్చి. ౩౨

మ॥ అట నేమేమి పొనర్పఁగావలయు న • ద్యద్భక్తి నవ్వాని న
న్నిఁటిఁ గావించి ప్రయాణమై యలక కెం • తే సంజకుం బోయి, యు

త్కటఖేదమ్మున వృద్ధునాలయబహిర్ద్వారమ్మునం జేర, న
చ్చట నెయ్యంబగు శ్రీధరుండు గని కైచాఁపిచ్చి నిట్టూర్పుతోన్. ౩౫

తే॥ గీ॥ నా "తెలిగ్రాము" గాంచిరా? నోటిమాట
యైన ప్రార్థింప లే దని యడలువాని
వాలకముఁ గాంచి కవి కడు జాలిఁ దూలి
లోనుబుకు దుఃఖ మడఁచి యవ్వాని కనియె. ౩౬

తే॥గీ॥ కమలకు సుఖంబె? నీ తెలిగ్రాము దేని?
కేమి మూడినదోయి యీయింట నేఁడు?
చెప్పుమా యన్న నడలుచు శ్రీధరుండు
బావ! కమల లేదింక ప్రపంచమందు. ౩౭

తే॥ గీ॥ అనిన విని నిలుపోపక హా! యటంచు
నా బహిర్వేదికోపరి నట్టె కూలి
"గ్రుడ్లనీరు గ్రుడ్లనె గ్రుక్కు"కొనుచు శ్రీధ
రా! సవిస్తరము వచింపరా! యనెఁ గవి. ౩౮

వ॥ అనిన శ్రీధరుం డిట్లనియె.

ఉ॥ వింతగఁ దోఁచెఁ బో ప్రసవవేదన నిన్నటి రెండుజాము లం
దంత భిషగ్వరాగ్రణుల నందరినిన్ బిలిపించి వారిచే
నెంతయుఁ నౌషధమ్ముల గ్రహింపఁగఁ జేసినపైన రాత్రి కా
వంత సుఖమ్మొసంగె; బ్రసవం బయె; గాంచెఁ గుమారుఁ బిమ్మటన్.

వ॥ అట్లు జన్మించిన కుఱ్ఱఁ డప్పుడ దివంగతుం డయ్యె. నారాత్రి యామ్యద్వయమ్ము గడచనఁ దీవ్రజ్వరతప్తదేహయై వడవడ వడంకు కమలం గాంచి దాది యావార్త వృద్ధతోఁ దెల్ప నాతండు ముదల నొసంగ నే భిషక్కుం గొనివచ్చితి. నాతఁడు నౌషధ మిచ్చి చనెఁ; దదౌషధసేవనానంతర మత్యంతబాధాకరం బగు వాంతిచే నామె యమితాయాసమ్ము నెంది ప్రభాతంబగునం దనుకఁ దదాయాసాపీడితయై కడకు నలిక్కులన్ జూచి, "కళానిధీ! కళానిధీ" యని యెలుగెత్తి కేక వైచి కన్గవమోడ్చె. నే నెల్లరము సంధ

పొడసూపె ననుదిగులున వైద్యునికొఱకు వార్త నంపితి; మతం డరుదెంచు నంత కంతయు ముగిసె నన దద్వృత్తాంత మాలించి కన్నీ రొడికగట్ట కొంతతడవల్లుండి పిదప శ్రీధరునియౌదార్పులం దేటి కమలా చిత్రచిహ్నాలం గొన్నింటి నడిగి లేచి నిలువంబడిన కవిం గాంచి శ్రీధరుండు బావా! యీ యర్ధరాత్రిమ్మున నెట కేగెద వన బ్రత్యుత్తరం బొసంగక తెవ్వన నేగు నాతని వెంటనంటి శ్రీధరుండు పిల్చుచున్నను వెనుదిరిగియైన చూడక కళానిధి యా యంధకారమ్మున నదృశ్యుం డయ్యె.

---

ఓమ్.

శ్రీమత్పరాంబికాయై నమః.



శ్రీ

# రసాశ్రయము.

## ౬వ దళము.

సీ॥ అది జీవగణముల ♦ తుదివెలుం గయ్యదే
కాళరాత్రికిఁ గాఁగ♦డాలడాలు
అది మానవాంత్యశాం♦త్యాలయం బయ్యదే
కాలమూరికిఁ బగ♦డాలమేడ
అది జనకోటిచి♦హ్నలదీవి యయ్యదే
మిత్రకుతుకఁ దళు♦కొత్తుదండ
అది మృతప్రాణిబిం♦బధ్యాకోశ మయ్యదే
ప్రళయరుద్రనితాండ♦వస్వనమ్ము
తే॥గీ॥ అది నరాఘమ్ములకుఁ గడ ♦ కబ్బుచోటు
అయ్యదే సమదృష్టిగా ♦ నరసి యీశుఁ
డెల్లరికిఁ దుల్యముగఁ బంచి♦యిచ్చుగేహ
మది మసనభూమి యమునిది♦వ్యరథనేమి. ౧

చ॥ చీఁకటి ధూమభస్మలుల ♦ చెల్వు గ్రసింపఁ జితాగ్నిదీపికల్
చేకొని డాకినుల్ వికట ♦ నృత్యములన్ బొనరింపఁగాఁ బిశా
చీకుల మెల్ల పిండములఁ ♦ జేతులఁ దాల్చి క్షుధార్తిఁ బొక్కఁ న
స్తోకసృగాలరావముల ♦ తో దిశ లెల్లెడ మాఱుమ్రోఁగఁగన్. ౨

తే॥గీ॥ అతిభయంకరమైన ప్రే ♦ తాలయమునఁ
గాడు కాడున కేగి యా ♦ కవివరుండు
నెన్నియో పరీక్షలొనరించి ♦ యేగుచుండెఁ
గాలి కూలిన వేఱొక్క ♦ కాటిదరికి. ౩

వ॥ ఇట్లు చితావ్రాతమ్ము లన్నియుఁ బరీక్షించి నిస్పృహఁ దపించి యుస్సు రని నిట్టూర్పు లొలయ నొండుచితిం జేరి యందు.

ఉ॥ నాలుగుదిక్కులన్ బుడమి ♦ నాటిన పుల్లలగురుఁ జూచి యాం
దోళనతోడఁ గాటిని గ ♦ నుంగవ లంటఁ బరీక్ష సల్పి స
గాలము లగి యుంట సొదఁ ♦ గాడ్పడఁ జేయమి పెట్టినట్టి యా
నా లివి పెట్టినట్టులె క ♦ నంబడె నంచు నెదం దలంచుచున్. ౪

చ॥ ఇది తలవైపు, పాదతల ♦ మియ్యది, యియ్యది యూరుయుగ్మ, మి
య్యది నడు, మియ్యదే యెద, యి ♦ దా గళ, మియ్యదె కా మొగమ్ము, నీ
యదె కనుదోయి, యంచుఁ జితి ♦ యందలి యస్థినిరూపణం బొన
ర్చుఁ దనమనమ్మునన్ ముగుద ♦ రూపము తాండవ మాడుచుండఁగాన్.

చ॥ తలఁపులలో నటించు వని ♦ తాలలితాకృతిఁ దచ్చితి న్నచం
చలదృఢభావనాబలము ♦ నన్ విరచించి తదేకదృష్టిమై
నిలిచెఁ గనుంగవన్ బొడము ♦ నీరము లింతలు నంతలై కెలం
కుల డిగి వార్ధిపోలిక న ♦ నంతతరీతిగఁ దన్ను ముంపఁగాన్. ౬

తే॥ గీ॥ ప్రాణమే లేని జీవితే ♦ శ్వరిచరిత్ర
తన తలఁపుటాసనమ్ముపైఁ ♦ దనరుచుండ
మాసిపోయిన కలికివి ♦ లాసరుచులు
పునుకతతిపై నిరూపించు ♦ కొను నతండు. ౭

తే॥ గీ॥ అతఁ డటు కొంతతడవు కొయ్యవడి నిలిచి
పొరలివచ్చెడు దుఃఖాశ్రువుల నడంచి
చదికిలంబడి జీవితేశ్వరిచరిత్రఁ
బనవి పనవేడ్చె గద్గదస్వన మెసంగ. ౮

ఉ॥ హా, కమలాస్య! హా, సురుచిరాధర! హా, జగదేకమోహినీ!
హా, కవయిత్రి! హా, సవినయాత్మిక! హా, ప్రణయస్వరూపిణీ!
హా, కలకంఠి! హా, సహృదయా! భవదీయఋణంబుఁ దీర్చ నీ
వీ కఠినాత్మునిన్ విడిచి యేదిశ కేగితివో? హృదీశ్వరీ! ౯

తే॥ గీ॥ బాసతప్పినవానికిఁ బ్రాచితమ్ము
నింత కఠినమ్ముగా విధియుంచితేల?
ప్రేయసీ! నీవు లేనట్టివిశ్వ మెల్ల
నాకనుంగవలకు శ్మశానమ్మె సుమ్మ. ౧౦

మ॥ కడప్రాణమ్మున నున్నవేళ మది నీకాంతిన్ను నూహించి 'యె
క్కడ నున్నావొ, కళానిధీ' యనుచుఁ గేకల్ పెట్టి నావంట, బె
గడిలన్ బాంధవు లెల్ల సంధి యని యీగాథల్ చెవి న్నాటిన
ప్పుడు నైనన్ మెయిఁ బ్రాణముల్ వదలవేమో? చయ్యనన్ బ్రేయసీ!

మ॥ నను సాధించితి వన్నిరీతుల నెలంతా! పుణ్యయాత్రావ్రతం
బొనరింపన్ దురితమ్ము లారునని నే నూహించితిన్ గాని పు
ణ్యనికాయం బిటు సేయు నంచు మదిలో నావంతయే నెంచ ధా
తృనియోగంబు నొకింత దాఁటఁ దరమా నే నేరికేన్ బ్రేయసీ! ౧౨

మ॥ అనవద్యంబు త్వదీయమానస, మనర్ఘస్వాంతుఁడన్, ద్వద్గభీ
రనితాంతోజ్జ్వలనిష్కళంకప్రణయార్ఘ జ్ఞానశూన్యుండ నౌ
ట, నినున్ గాలుని కప్పగించితినఖండప్రేమసామ్రాజ్యల
క్ష్మిని దక్కించుకొనంగ లేనయితిఁ జూమ్మి మందబుద్ధిన్ సఖీ! ౧౩

తే॥ గీ॥ భయముగా నుండె నీ గర్భభరము నాకు
నెల గతింపక మున్న రావలయునంచుఁ

దొరలు కన్నీటికౌఁగింటఁ ♦ దోఁగినార
మఱె కడబుణం బని యెఱుంగ♦నైతి నకట!

ఉ॥ నెమ్మది సంశయించెదవు ♦ నిత్యము నాదగు ప్రేమ నిష్కళం
కమ్మొ, కళంకమో యని య♦ఖండము నా ప్రణయమ్ముగూర్చి నీ
కిమ్ముగఁ జెప్ప నప్పుడిది♦యే భవదీయహృదంబుజాసిఖ
ద్గమ్మున వ్రిక్కలించెద నె♦డందఁ బరీక్ష యొనర్చి ప్రేయసీ! ౧౫

తే॥ గీ॥ పాపమో, పాపమో, యంచు ♦ బ్రతికినన్ని
నాళ్ళు మన సీయనైతి నీ ♦ నాఁడు కుమిలి
కుమిలి యేడ్చుచుంటెని? యీ వ♦కుటిలమహిత
ప్రణయమూర్తివి నీకు నా♦రకము లేదు. ౧౬

తే॥ గీ॥ నీదు ఛాయాపటమ్మును ♦ నీ ప్రణీత
పద్యములు నీకుఁ బ్రతిగ న♦ర్పణ మొనర్చి
యీ యదృష్టవిహీనున; ♦ కేగినావె
కనికరఁపు దీవియైన లో♦కమున కబల! ౧౭

ఉ॥ ఏకనుదమ్మి యశ్రుకణ ♦ మింత కనుంగొనినంత జీవముల్
పోకడ పెట్టుచాడ్పు వగ♦పున్ గనువాఁడనొ, యాకనుంగవల్
నాకయి యుబ్బుదేరఁగ న♦లందరుచున్ నిరతోష్ణబాష్పధా
రాకలితమ్ము లైనవన ♦ నక్కట! గుండియ వ్రీల దేలనో. ౧౮

తే॥ గీ॥ నీ హృదగ్ని చితాగ్నియై ♦ నిన్నుఁ గాల్చె
నాదు దుఃఖాశ్రుజలనిధి ♦ నాహృదంత
రాళబడబానలము నన్ను ♦ మ్రగ్గఁజేసి
కలిపి నీతోడ సుఖమూర్తిఁ ♦ జలుప వకట. ౧౯

శా. లేరే ధారుణి నెందునేన్ విధురకే♦ళిన్ గ్రాఁగి మోదమ్ము లే
పారన్ గూడి చరించు దంపతులు క♦ట్టా! యిట్టి దుర్భాగ్య మె
వ్వారేన్ బొందిరె, లేక నా యఘఫల♦వ్రాతంబు దుఃఖైకగా
థారంభంబు నొనర్ప నెంచెనొ మదీ♦యాశాలతల్ త్రుంగఁగాన్. ౨౦

తే॥ గీ॥ తలఁప నే నింక స్థూలనే◆త్రముల తోడఁ
జూడఁగా లేనుకో నీదు◆సోయగమ్ము
హా మదీయజీవంజీవ◆మా! యయో! ప్ర
ణయనిధానమా! హా సుఖా◆నందమూర్తి! ౨౧

క॥ అని తల మోదుకొనుచు నే
చిన నెవ్వగల సెగలాని ◆ చిత్త మెరియ హా
యని నేలం బడియె నచే
తనునిక్రియన్ జీవకోటి ◆ దయఁ ద న్నరయన్. ౨౨

వ॥ కొంత తడవట్లు పడిలేచి పెల్లుబ్బుదుఃఖమ్ము నడంచి యామెం దలంచి.

ఉ॥ ఆలివి కాదుకాని, తన◆యావలిఁ గాంచఁగలేమిగాని, యి
ల్లాలికి నీకు భేదము ర◆వంతయుఁ దోఁపనిభంగి నెల్లకృ
త్యాలిఁ బొనర్చి నాహృద◆యమ్మునఁ గాపురముంటి, నిందు చూ
లాలితనమ్ముతో నుతక◆లాకలితాస్యముతో హృదీశ్వరీ! ౨౩

మ॥ తల నొక్కించుక వాల్చి కేల్మొగిచి డెం◆దమ్మందు విశ్వాససం
కలితానందము మిన్ను ముట్ట నెదియేన్ ◆ గానిందు మీ చెప్పిన
ట్టులు కావించెద నంచు నాయెదుట నొ◆ట్టుం బెట్టు కొన్నట్టి నాఁ
టి లసన్మోహనమూర్తి కన్నులకుఁ గ◆ట్టె న్నేఁడునున్ బ్రేయసీ! ౨౪

ఉ॥ కమ్మని తేనెవాఁకలచొ◆కారము లుల్లసిలంగ నూత్నభా
వమ్ములతో సమగ్రరస◆పద్ధతి నల్లిన పద్యజాలమే
నిమ్ముగఁ జూచి మెచ్చి కవ◆యిత్రివి నా దన లజ్జ నొందు నీ
యెమ్మెకు సంతసించి [illegible] ◆ నీగతు లెంచకయే హృదీశ్వరీ! ౨౫

శా॥ ఏ నేదేన్ నిశలన్ రచించునెడ నెం◆తే నీవునుం గూడ, యే
వో నాలక్షరముల్ లిఖించి సరియో◆నో లేదొ? యీక్షింపు డం
చానన్ బెట్టి యెట న్ననున్ విడువ కొ◆య్యారమ్మునన్ నాపనుల్
మానంజేసియుం హాస్య మాడెదు నినున్ ◆ భావించెదం బ్రేయసీ! ౨౬

ఉ॥ నీకళ, నీయొయ్యారమును, ♦ నీనగుమోమును, నీవిలాసమున్,
నీకవితారసస్థితియు, ♦ నీ మృదుగానము, నీప్రగల్భముల్,
నీ కువు కూనినాదములు, ♦ నీ సరసోక్తులు, నీ సపర్యలున్,
నాకు సతమ్ము లంచు మది ♦ నమ్మితి నీగతు లెంచ కక్కటా! ౨౭

తే॥ గీ॥ కలికి నీ కేహ్యమైన జ♦గమ్ము నాకు
భోగ్య మెల్లగు నని తల♦పోసినావు
వచ్చెదను నేను గూడ యే ♦ వామలేని
తావుల సుఖింపఁ గలము మో♦దమున సకియ! ౨౮

శా॥ నిందావాక్యము లాడుచుండిరి యొరుల్ ♦ నేస్తమ్ముఁ జాలింత మ
న్నం దైన్యమ్మున నన్ను జూచి తగవౌ♦నా మీకు లోకానికై
యొందేనిన్ దమభావముల్ విడచువా ♦ రెవ్వార లాయంబదృ
ష్టిం దప్పుంబడకున్నఁజాలు నను నీ♦చిత్తంబు మెత్తున్ సఖీ! ౨౯

ఉ॥ గాదిలిచైదముల్ సలుపఁ♦గా దొరకొన్న క్షణమ్ములందు, నే
మాదిరి లేని ప్రేమరస♦మండితకోపము నూనువేళ, న
త్యాదరశీతలేక్షణసు♦ధారసధారల ముంచునాఁడు, నా
యీ మరదృష్టపుం దశ యొ♦కింతయుఁ దోఁపక పోయెఁ బ్రేయసీ! ౩౦

మ॥ జడవ్రేల్లం బడి మాఱుమో మిడిన నా♦చాయన్ విలోకించి యే
వడువున్ జేఁతలనేని నాప్రణయకో♦పం బార్పఁగారామిఁ జే
రడ లేపార ననున్ క్షమింపఁదగు నేఁ ♦ డంచున్ విచారాశ్రుధా
రలఁ దోఁగాడుచు నాకవుంగిలికిఁ జే♦రన్ వచ్చు ని న్నెంచెదన్. ౩౧

చ॥ ప్రణయము మీఱఁగా రజత♦పాత్రమునందు నవోదనమ్ము శా
కనిచయమున్ ఘటించి ననుఁ ♦ గాంచి హసించి చవుల్ వచించు చ
ల్లన "మడి వీవనం" గొని క♦రమ్మున వీఁచుచు నాకు వృద్ధిపాం
తన గుడువంగఁ బెట్టు వని♦తాలలితాకృతి నింకఁ గాంతునే? ౩౨

శా॥ అంచుల్ తీర్చినకుచ్చెళుల్ పదములం ♦ దల్లాడఁగా, మేని క్రొ
మ్మించున్ మించెడు తళ్కు దువ్వలువపై ♦ మేల్మించఁ, జిల్కువ్వ రా

ణించన్ మోవియపై, నిజాస్యము ప్రపం♦చించన్ విలాసమ్ము, శ్రీ
నించన్ జూడ్కులు, దేవిఁ గొల్చెదు నినున్ ♦ జింతించెదన్ బ్రేయసీ!

---

మ॥ కలితానూనరతిన్ సుఖించునెడలం ♦ గౌఁగిళ్లలో సొక్కవే
ళల గండమ్ముల ముద్దుపెట్టుచుఁ బ్రియా♦లాపమ్ములన్ ముంచు నాఁ
డలినీలాలకముల్ నఖప్రతతి న♦వ్యాజమ్ముగా దువ్వుచోఁ
దలఁపన్ నీపయిఁ బ్రేమ యింతదని డెం♦దమ్మందునన్ బ్రేయసీ! ౩౪

చ॥ పులుకుపులుక్కునన్ గనుల ♦ ముంచెదు నశ్రులతోడ గద్గదా
కలితవచస్సుతోడ భయ♦కంపితగాత్రముతోడఁ బెన్దిగుల్
తలఁకొను మోముతోడ నెల♦దాఁటకము న్నరుదెం డటంచు న
న్నలయుచుఁ బల్కు నీ కభయ ♦ మిచ్చి తొలంగితి సైపుమా సఖీ! ౩౫

తే॥ గీ॥ సైపుమా యంచు వేడుచుఁ ♦ జరణసీమఁ
దలను వ్రాల్చిన ననుఁ బ్రియం ♦ బొలయఁ గాంచి
కౌఁగిఁట గదించు మోహనా♦కార మీ భ
వమ్మునందున నాకుఁ గ♦న్పడదు కాదె. ౩౬

ఉ॥ ఇమ్మెయి నంత్యకాలమున♦కేఁ జనుదేరమి నే మటంచు డెం
దమ్మున సంతపించితివొ ♦ నాకు లిఖించిన యట్లు నిండు ప్రా
ణమ్ముఁ దొఱంగువేళనయి♦నన్ గఠినున్ ఖలు నీకృతఘ్ను నా
మ మ్మెటు లెంచినావొ యణు♦మాత్రము కిన్క వహింప కంగనా! ౩౭

తే॥ గీ॥ ఈ చితాగ్నిమహాజ్వాల♦లెల్ల నన్ ద
హింపఁజేసినఁ గొండయుఁ ♦ బృథివి నేక
మై ననున్ నల్చివేసినన్ ♦ గాని నాదు
కలుషమున కేమి నిష్కృతి ♦ కలదు కలికి! ౩౮

తే॥ గీ॥ స్వప్నమందైన నా కంటఁ ♦ బడి క్షమించి
తి నని నీవు వచింపకుం♦డిన నెలంత!
యిహపరమ్ములలోన నీ ♦ యీ కృతఘ్ను
వేషికిన్ దావు దొరకునే ♦ విశ్రమింప? ౩౯

... ... ... ...

క॥ అని కొండొకతడ వాఁగియుఁ
గనుదమ్మి నిమీలితమ్ముగాఁ దలఁపుల నా
ననఁబోఁడి నిలిపి ధ్యాన
మ్మున మునిఁగెన్ సుదతిఁ గాంచుపూన్కి యెసంగన్. ౪౦

వ॥ ఇట్లు ధ్యానించియుఁ గలికి నరయఁజాలక యోజన మెఱయ.

తే॥ గీ॥ కాలబద్ధమ్ము లోకమ్ము కాలబద్ధ
మీ జనౌఘమ్ము సర్వమ్ము నీవు నేను
గాలబద్ధుల మట్లౌటఁ గలికి! నీవ
యెట్లు స్వప్నసాక్షాత్కార మీయఁగలవు. ౪౧

వ॥ అని కాలు నుద్దేశించి.

క॥ ప్రణయపిపాసావేశిత
నను నాప్రణయార్ద్రమూర్తి నాజీవముతో
ననుకంపఁ గలుపుము మన
మ్మున నినుఁ గొల్చెదను కాలమూర్తీ! సతమున్. ౪౨

తే॥ గీ॥ నా ప్రణయభాగ్యరాశిని నా విశుష్క
జీవితానందమూలంబు నీ విభావ
రి నొకసారి చూడఁ దలంతుఁ గనికరమున
దానిఁ జూపింపుమా దయార్ద్రస్వభావ! ౪౩

సీ॥ కడ కేమి మధువు చిల్కఁగ నెంచెనో నాదు
పతితజీవితనీచపాత్రియందుఁ
దుద కెటుల్ హృదయతంత్రుల మీట నెంచెనో
నా హృదయాగ్నికి దోహదముగఁ
జివర కే ప్రీతినలఁ జెల్లింప నెంచెనో
నా క్షమాపణవితానమ్ము లురలఁ
జనుచు నే ప్రళయగర్జనఁ జేయ నెంచెనో
నా శిలాసదృశమనస్సు ప్రిదుల

తే॥ గీ॥ నంత్యమం దెట్టివాగ్దత్త మభిలషించి
నదియొ మాస్థిరప్రేమ చిహ్నముగ దాని

నడిగి చూచెదఁ గృప నూని ◆ యామె నొక్క
సారి చూపింపుమా నమ◆స్కార మిడుదు. ౮౪

మ|| అనిసర్గం బవిచారణీయ మకృతం ◆ బన్యాయ్య మీ కార్య మె
ట్లనువౌ మానవజాతి కీతఁ డిటులే◆లా కోరెనం చెంచెదే
మొ నతిన్ నాకయి ధారవోసి సకలం◆బున్ నన్నె ప్రాణం బటం
చనుకాంతన్ గడసారి కాంచు కొఱకేన్ ◆ యత్నించు టన్యాయ్యమే?

ఉ|| న్యాయమె? మీసభాంగణము◆నన్ మనులేన్ దల లూఁపనెంతురే?
పాయని ప్రేమరాజ్యవిభ◆వప్రమదామృతడోలికావిహా
రాయతభృంగదంపతుల◆యం దొకదాని వధింపఁ జూచు ట
న్యాయము కాదె ప్రేమకరు◆ణారహితం బిల ధర్మమే ప్రభూ. ౮౬

ఉ|| లోకమనోజ్ఞతాపరిణయ◆లోలుప మైన స్వతంత్రగానమా
లాకలనమ్ముచేత దిశ◆లన్ విహరింపుచు సాత్వికోదయ
శ్రీకి! నిధాన మై యెసఁగు ◆ భృంగకులాంగన నేల త్రుంచితో
యీ కనికార మేది యది ◆ యే మపరాధము సల్పెనో ప్రభూ! ౮౭

తే|| గీ|| ప్రణయపరిమళ మఖిలది◆క్ప్రతతి నిండ
దైవగతిచేత నొక్కల◆తన్ వసించి
జగము మఱచిన క్రొంబూవు◆జంట వేఱు
పఱుపఁ జేయాడు నొక్కొ ము◆ష్కరుని కైన.

క|| నీవేడ? దయావిరహిత
మీవిత మేడను? మదీయ◆వృజిన మె ని న్ని
త్రోవ నడిపె నేమొ? కృపా
భావమ్మున నాదువిన్న◆పముఁ జేకొనుమా. ౮౮

చ|| ఎఱుఁగనివాఁడఁ గా నుసురు ◆ లేదినజీవుల కెల్ల నీదుచు
ట్టఱికము తప్పదంచు, నక◆టా! యటులైన యనాథపాళి ని
ష్కారణముగా దురంతనర◆కమ్ములఁ ద్రోయుచు వంచు నింత ని
ష్ఠురుఁ డగు నెవ్వఁ డేన్ నెనరుఁ ◆ జూపుటసత్య మటంచుఁ గాలుఁడా!

చ॥ ఎఱిఁగియు నిట్లు వేడగత ♦ మేమనె దేనియు నిన్నుఁగూర్చి వి
స్ఫురతరధర్మమూర్తి వను ♦ సూక్తులు వింటి, దయాప్రియత్వమే
పెరవగు ధర్మసిద్ధి కని ♦ పెద్దలు వాకొనుచుండ్రుగాన ని
ష్కరుణిని వేడుచుంటిఁ గని ♦ కారము నూనుట పాడియా ప్రభూ! ౫౧

చ॥ హృదయము ప్రక్కలౌ హృదయ ♦ మే కలదేనియు నేరికేని నా
కథ వినినంతమాత్ర, నవుఁ ♦ గాదని యాడవుగాఁక నాదుగ
ద్గదికరవమ్ము నీచెవుల ♦ గాడదొ గాడియు మౌనముద్రయే
కద యధికారగౌరవముఁ ♦ గాంచును పో యనుకొంటివో ప్రభూ! ౫౨

మ॥ ఒరునాలిన్ గమియించి దానిఁ గనునుద్యోగమ్ము వాటించి యా
మొఱకుం డున్మదుఁడై మెయిన్ మఱచి యే ♦ మో ప్రేలుచున్నాఁడు తాఁ
దిరమ ట్లీతఁడు మేను వీడుక్షణమం ♦ దే వీనికిన్ దగ్గయుం
త్తర మీయందగు నంచుఁ గ్రోధదశనం ♦ దన్ బోకుమీ నాపయిన్. ౫౩

వ॥ అని యొక్కింత మిన్నకుండి యినుమడించిన దుఃఖమ్మునఁ గాలు నుద్దేశించి.

సీ॥ క్షీరనీరన్యాయ ♦ సిద్ధి కాలముఁ బుచ్చు
పతిఁ సతి నెడబాపు ♦ పాతకమ్ము
జరఠమాతాపితృ ♦ చరణసేవ యొనర్చు
చిఱుత నొక్కరు మ్రిందఁ ♦ జేయునఘము
రూపయౌవనకళా ♦ రూఢవిద్యాన్వితుఁ
గడుబాల్యమున దూల్చు ♦ కలుషఫలము
కంకణత్యాగమ్ము ♦ కాకమున్నె సుమాంగి
విధవగా సల్పు కి ♦ ల్బిషచయమ్ము

తే॥ గీ॥ చివరకు ననుంగులను నిరీ ♦ క్షింపనెంచు
కొనినవారి క్షణమ్ములోఁ ♦ దునుగఁజేయు
పాపమున్ ధర్మ మున్న నె ♦ ప్పటికినైనఁ
గట్టికుడుపక మానునే ♦ కాల! నిను. ౫౪

వ॥ అని యొక్కింత విచారించి.

తే॥ గీ॥ ప్రకృతిలోన స్వతంత్ర మె♦వ్వరికిఁ గలదు
ఈవు నుద్యోగివే కదా ♦ యీ సమస్త
మునకుఁ గర్మ మాధార మం ♦ చని వచించు
కాదె శాస్త్ర చయమ్ములు ♦ కాలమూర్తి! ౫౫

వ॥ అని తన ప్రేయసిం దలంచి.

తే॥ గీ॥ కఠినలోక మ్మొకింతేనిఁ ♦ గన్నుఁ గాన
దవల విధి దానికే సహా♦య మ్మొనర్చు
ధర్మమా యన్నఁ గర్మప♦థమ్ము ద్రొక్కుఁ
బ్రణయపరిమళ మన్న స్వ♦ప్నంపుగాథ. ౫౬

తే॥ గీ॥ కర్మబద్ధుండు జీవుండు ♦ కర్మ యనఁగ
బూర్వభవమున నీ జన్మ♦ పుంబథమ్ము
నట మెసవఁ గట్టుకొన్న య♦న్నంపుమూట
దానిఁ గుడువక త్రోయ నె♦వ్వాని తరము. ౫౭

తే॥ గీ॥ తెరువు బత్తెమ్ము సెల్లినఁ ♦ దిరిగి బత్తె
మును గ్రహించి యీపుట్టు♦వున మఱొక్క
దారిఁ జనుచుండు నీ జీవ♦తతులలోన
నీవు నే నెవ్వరమొ యెట్టు ♦ లెఱుఁగఁగలము. ౫౮

తే॥ గీ॥ ఎట్టి లేఁబచ్చికబయళ్ళ ♦ నెట్టివనుల
నే మహీరుహచ్ఛాయల ♦ నేస్రవంతి
తటుల సుఖమూర్తివై ముదా♦స్థాన వగుచు
నెచట నున్నావొ నన్ను వి♦స్మృతివహించి. ౫౯

మ॥ అవనిన్ నీకయి నే నొనర్పఁగల కా♦ర్యం బేమియున్ లేదు నీ
యవతారమ్ము మదీయమానసమునం ♦ దావాస మై నిల్చి మ
త్కవితాచిత్రములన్ నటించు సతత♦ఖ్యాతమ్ము గా; నీవ యో
జ్జవు నై కూర్చిన గాథదీక్షితుఁడనై ♦ సాగింతు నా కాలమున్. ౬౦

తే॥ గీ॥ నీకు నర్పించినట్టి నా ♦ నెమ్మనమ్ము
నొరుల కర్పింపఁ జాల నా ♦ యుసురు లుండు

దనుకఁ గాపాడి యాపయిఁ ♦ దరలివచ్చి
నీది నీ కిచ్చువాఁడ నెం♦తే లతాంగి! ౬౧

తే॥ గీ॥ నీవలె దృఢానురాగసం♦దీపితుండఁ
గాకపోయినఁ గాని యీ♦కార్యమైనఁ
జేయఁగల శక్తిఁ గూర్చు నా♦శీస్సు లిడుతఁ
గనకదుర్గాంబ సతతమ్ము ♦ కలికి! నాకు. ౬౨

చ॥ ప్రతిన వహించినట్టులు ల♦వంబును దప్పక సత్ప్రవృత్తి నా
సితిఁ దనువుజ్ఞ ద్యజించితి వ♦ధీరుఁడ నేను గృతఘ్నుఁడజ్ఞ భవ
త్ప్రతి యనిపించుకోఁదగని♦వాఁడఁ ద్వదాత్మకు శాంతిఁ గూర్ప నా
ప్రతినయు నేఁడు దీర్చెద, వి♦వాహము వీడి యతీశ్వరుండనై.

తే॥ గీ॥ ఏ ప్రకృతి నన్ను నీక్షించి ♦ యేడ్చుచుండె
హిమకణమ్ములె బాష్పవా♦హినులు కాఁగ
నా ప్రకృతి సాక్షి కాఁగ స♦న్న్యాసి నగుచుఁ
గాలమును బుచ్చువాఁడ నీ♦కై లతాంగి! ౬౪

తే॥ గీ॥ ప్రకృతిలో లీన మైపోయి ♦ ప్రకృతిలోన
నీ స్వరూపమ్ము నీక్షించి ♦ నీదు నామ
మంత్రనిధ్యానరతుఁడ నై ♦ మామకీన
కాలమును ద్రోయువాఁడ నీ♦కై లతాంగి! ౬౫

సీ॥ కలవుబో నీమేని♦తళుకులు నెఅసంజ
సంజుచాయలలోన ♦ మించుఁబోఁడి
కాలుఁబో నీ కపో♦లముల చెల్వము గులా
బి పువ్వురేకులలోన ♦ వెలఁదిమిన్న!
నెరయించుఁబో నీదు ♦ నెఱులనిగ్గులు గండు
తేఁటిమొత్తములోనఁ ♦ దీపులాడి!
నవరిల్లుఁబో నీదు ♦ నవ్వుమోముకళ లెల్ల
నిండుజాబిల్లిలో ♦ నీలవేణి!

తే॥ గీ॥ వఱలుఁబో నీమ్రు వేసంపుఁ♦బరువ మెల్లఁ
బ్రకృతికళ్యాణమూర్తిలోఁ ♦ బ్రణయమూర్తి!
యిట్లు మృతజీవపై నీవు ♦ నెసఁగుచున్న
నాకు జీవన్మృతపె కాదె ♦ నాతి! ధాత్రి. ౬౬

తే॥ గీ॥ భావనాప్రౌఢి నీ స్వరూ♦పమ్ముఁ బ్రకృతి
యందునం గాంచి తావకా♦నందదర్శ
నాద్యఖిలవర్తనలఁ దృప్తి ♦ నందువాఁడఁ
బ్రణయయోగమ్ము సిద్ధించు♦వఱకు నతివ! ౬౭

సీ॥ ఏ చాయఁ గిన్నరీ♦బృందంబు ప్రణవళీ
రారవంబులఁ దేలి♦యాడుచుండు
నే వీట భర్తృసే♦వాపైముషీమణు
లానందమున నోల♦లాడుచుండు
రేచక్కి యోగస♦మృద్ధమౌనిగణంబు
లభివాంఛలకు నడ♦యాడుచుండు
నే దిక్కు మోక్షకాం♦తాదరస్మేరాచ్ఛ
కౌముదీరేఖ జ♦గ్గాడుచుండు
తే॥ గీ॥ నే వని పరాంబికాకథా♦మృతవిలోల
భక్తహృదయాంబుజముల రా♦పాడుచుండు
నా స్థలమ్ములు దుర్గావి♦హారభూము
లంగనా! నీకుటీరమ్ము ♦ లగును గాత. ౬౮

వ॥ అని దుర్గాలయమ్ముపై పునకుఁ జూడ్కి నిగుడ్చి.

తే॥ గీ॥ ప్రణయమంత్రమ్మె ప్రకృతిస♦ర్వస్వ మంచుఁ
దలఁచి చరితార్థయైన ని♦ర్మలచరిత్రి
మామకీనమనోరాజ్య♦మండితాత్మ
కఖిలసౌఖ్యమ్ములిడు! పర♦మంచు నంబ! ౬౯

శా॥ ఆదిన్ నే నిను వేడినాఁడ జగదం♦బా! త్రోయకీ పాపమం
దీ దౌర్భాగ్యు నటంచు నద్దివిన కీ ♦ వీకాంతనుం గూర్చినాఁ

దౌదార్యాశిషముల్ పొసర్పు మని సం♦ప్రార్థించితిన్ గాని, యి
ట్లీ దుఃఖాగ్నినిఁ గాల్తు వంచెయుఁగ న♦న్నెంతేని దుర్గాంబికా! ౩౦

ఉ॥ కోరినయట్టి కోర్కె లొన♦గూర్చెడు చుట్టమవౌటఁ జిత్కళా
కారిణి వౌట, భోక్త్రివిని ♦ కర్త్రివి నౌటను, బుణ్యపాపపుఁ
భారను లెల్ల నీపయిన ♦ వైచి భవచ్చరణాబ్జయుగ్మ మా
ధార మటంచు నమ్మితిఁగ♦దా యిటు సల్పితి వేల? యంబికా! ౩౧

శా॥ శ్రేయోదాత్రివి నాకు శ్రేయ మిడఁగాఁ ♦ జింతించియే మామక
స్వాయత్తప్రమనిధానమున్ మరుగుస♦ల్పన్ జాగి విజ్ఞాన రా
గాయత్తున్ బొనరించినావు ననుఁ గ♦ర్మాంభోధి లంఘింప నే
జేయంబోవు ప్రయత్నముల్ సఫలముల్ ♦ చేయంగదే యంబికా! ౩౨

శా॥ ఖేదోద్దీపక మీ హృదబ్జము, లతాం♦గీప్రేమగాథావిధా
నాధారంబున దుఃఖకీలికలఁ ద్రో♦యన్ జాగు నేకాని దుః
ఖాదిచ్ఛేదక నిశ్చలాంచితతపో♦వ్యాపారమున్ బూన నీ
వే దారిన్ ఘటియించెదో యది విధా♦త్రీ! స్వర్ణదుర్గాంబికా! ౩౩

శా॥ అంబా! కర్మమహాటవిన్ బడి సతీ♦వ్యామోహవల్లీ నికుం
జంబుం గాంచి పథశ్రమున్ గడచునా♦సన్ విశ్రమింపన్ ఛటా
రంభప్రోజ్జ్వలదావపావకశిఖా♦క్రాంతంబుగా దిక్కు లె
ల్లం భీతిన్ నిను వేడు నప్పుడిదిఁ గా♦లన్ ద్రోయు టేన్యాయమో? ౩౪

ఉ॥ కాన దయారసమ్మ కడ♦గన్నులఁ దాండవ మాడ బ్రహ్మచ
ర్యానతలోభమోహవిష♦యాన్వితుఁగా, నిరవద్యనిశ్చల
ధ్యానపటిష్ఠనిష్ఠునిఁగఁ ♦ దాపసిఁగాఁ బొనరించి పిమ్మటన్
లీనము సేసికొమ్మ జన♦నీ! భవదుజ్జ్వలమూర్తిలోపలన్. ౩౫

తే॥ గీ॥ విశ్వచైతన్యమూర్తివై ♦ వెలయు నీవ
కాక దిక్కెరు గలరు లో♦కమున నాకు
నెనరు దనుపారుచూడ్కి దీ♦వన లొసంగి
కలుపుకొనుమమ్మ నీలోనఁ ♦ గన్నతల్లి. ౩౬

సీ॥ కావింపుమా! వృద్ధ♦వైవాహికపిశాచ
జాలమ్ములను నేల♦పాలుగాగ

తెలయింపుమా భర్త్రు♦విరహితబాలికా
ప్రతతికి కళ్యాణ♦వైభవమ్ముఁ
దనరారఁజేయు మా ♦ ధర్మాంచితానురా
గరసోరుహృద్వ్యథా♦వరగణమ్ముఁ
గలిగింపుమా కన్య♦కావిక్రియస్వాంత
మాతాపితృలకు స♦న్మానసమ్ము
తే॥ గీ॥ నాశిషము లీయుమా ప్రణ♦యప్రపూర్ణ
విహరణవిహంగసదృశప♦విత్రహృదయ
నాయికానాయకులు వియో♦గాయితాగ్ని
సోకు నొందకయుండ లో♦కైకజనని! ౨౨

తే॥ గీ॥ అనుచుఁ గొనగోట నెగమీటి ♦ యశ్రుబిందు
వులను, అస్రవితతపైన ♦ నిలిపిచూడ్కిఁ
దిరిగి తెప్పలఁ జిప్పిలి ♦ దృఙ్నిరోధ
మును బొనర్పంగఁ గన్నీర ♦ మనియె నిట్టు. ౨౩

సీ॥ నాదురవస్థఁ గాం♦చఁగ లేమి మింట నొ
క్కొకటిగఁ దారు తా♦రకలు సాక్షి
నను నూరడింప న♦ల్లనఁ జిన్ని కెరటాల
దరి కంపెడు నదీమ♦తల్లి సాక్షి
నాకై తుషారక♦ణవ్రాత మశ్రుధా
రలు గాఁగ నేడ్చెడు♦ ప్రకృతి సాక్షి
నాయేడ్పు వించుఁ గు♦లాయమ్ములను వీడి
చదలఁ గుందుపులుంగు♦జంట సాక్షి
తే॥ గీ॥ నా నయనజమ్ములై, కవో♦ష్ణమ్ములై, న
దీసమానమ్ములై, యెడ♦తెగక పారు
నశ్రుధారలు సాక్షి యే♦ యతివ కేని
నా ప్రణయనూన మర్పింప ♦ నమ్ము మబల! ౨౪

ఉ॥ హే దరహాసవాసితము♦ఖీ! యదిగో యద నవ్యజ్ఞానభా
నూదయ వాటికన్ బ్రకృతి ♦ నూల్కొనియెన్ గనకార్ద్రరేఖ శాం

త్యాదరకృష్ణపక్షదివ♦సాంత్యకళానిధి వెల్లనయ్యె నే
నీ దినమే యతిత్వము గ్ర♦హింపఁగ నేగెద, నాజ్ఞ నీయుమా!

క॥ అని రెండడుగులు ముందున
కు నడచి వెనుదిరిగి నిల్చి ♦ గోడున దుఃఖాం
బునివహ మురలఁగ గద్గద
నినదమ్మున నాతఁ డిట్లు ♦ నెవ్వఁగఁ బలికెన్.

సీ॥ అడుగంటరాని నా♦యభివాంఛితములోనఁ
గలికి! నీ ఛాయలే ♦ కానుపించు
నిట్టలంబైన నా ♦ నిట్టూర్పుసెగలలోఁ
బ్రణయినీ! నీచరి♦త్రయె స్పృహించుఁ
గడవల నింపు నా ♦ కన్నీటి తెరలలోఁ
బ్రేయసీ! నీదు మూ♦ర్తియె నటించు
ధ్యానమ్ము మాను నా ♦ మౌనవ్రతములోన
రమణి! నీనామవ♦ర్ణమె స్ఫురించు

తే॥ గీ॥ రాగశూన్యమ్ము నైన నా ♦ యోగముద్ర
లోఁ గుములఁ జేయు నీదువి♦యోగకీలి
శాంతి యత్నించు నాదు నే♦కాంతసీమఁ
దెలవ నీతుది పల్కె ప్ర♦తిధ్వనించు

... ... ... ...

తే॥ గీ॥ ఇట్లు వాక్రుచ్చి స్వర్ణము♦గ్రేశ్వరీని
వాసమార్గమ్ముఁ బట్టి య♦వ్వాఁడు నడిచె
మెలఁత పునుకలఁ గనుచూపు♦మేరవఱకు
వెనుదిరిగి చూచుచున్ దుఃఖ♦వివశుఁ డగుచు.

... ... ... ...

తే॥ గీ॥ ప్రకృతిసిద్ధంబు నగుస్వరూ♦పం బొకండు
ప్రకృతిమూలంబు నగు మహా♦ప్రణయమొకటి
ప్రకృతి నాడించు దుర్గావి♦లాస మొండు
నాకవీంద్రునకు స్మరణీ♦యమ్ము లయ్యె.

సమాప్తము.

